# సీతాకళ్యాణము.



గ్రంథకర్త:

సోమరాజు రామానుజరావుగారు.



ప్రకటనకర్త:

కందుల గోవిందం.

బెజవాడ.

కాకినాడ స్కేప్ అండ్ కో. కే. సుబ్బారాయ

సోదరులచే ముద్రింపబడినది.

కాపీరైటు రిజిస్టర్డు.] 1925. [వెల 0-12-0.

| —• నవలలు •— | | —• నవలలు •— | |
|---|---|---|---|
| ఘోరకృత్రిమము | రు. 1-8 | నందచరిత్ర | రు 0-4 |
| కుసుమ | 1-4 | వినోదములు | 0-8 |
| మనోహారిణి | 1-8 | డిటో రెండవభాగము | 0-8 |
| పచ్చపుదొంగ | 1-0 | గణపతి 1 భాగం | 0-12 |
| చంద్రగుప్త | 0-8 | డిటో రెండవభాగము | 0-12 |
| ప్రతాపసింగు | 1-0 | రఘుకులచరిత్ర | 0-10 |
| కాళిక | 1-0 | సిద్ధార్థచరిత్ర | 0-12 |
| ప్రచండభైరవి | 0-12 | రాజరత్నము | 0-12 |
| వనదుర్గము | 1-0 | అకవాసింగరి | 0-8 |
| కాళిదాసుచరిత్ర | 1-0 | బహదూర్‌సింగ్ | 0-12 |
| ఆత్మసామ్రాజ్యము | 1-0 | —వైద్యగ్రంథములు— | |
| కలికాలచర్య | 0-6 | యునానివైద్యం | 0-12 |
| లోకాభిరామాయణం | 0-6 | ధన్వంతరీవిజయం | 0-10 |
| కేసరీవిలాసము | 1-0 | నేత్రదర్పణం | 0-8 |
| చిత్రరేఖ | 0-10 | వ్రణచికిత్స | 0-8 |
| ప్రసన్నముఖ | 1-0 | దంతశోధని | 0-6 |
| ప్రహసనములు | 0-8 | రసయోగరత్నాకరం | 1-0 |
| భారతాభ్యుదయం | 0-12 | మహాదేవకటుచికిత్స | 0-6 |
| కర్పూరమంజరి | 1-0 | రసప్రదీపిక | 0-12 |
| సౌందర్యతిలక | 1-0 | అనుపానమంజరి | 0-8 |
| అహల్యాబాయి | 0-12 | సద్వైద్యజీవనం | 0-8 |
| రామచంద్రవిజయం | 0-12 | సూక్ష్మరోగచికిత్సారత్నాకరం | 0-12 |
| హేమలత | 0-12 | కరకేహాపాకప్రకాశిక | 0-8 |
| కృష్ణవేణి | 0-6 | పానీయకల్పవల్లి | 0-4 |
| మణిమంజరి | 0-6 | ఆయుర్వేదసారసంగ్రహం | 0-12 |

వలయువారు :—జనరల్ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణజిల్లా.

# సీతాకళ్యాణము

ఇది

ధరాత్రిదలపురవాసియు, స్వరాజ్యగీతాది బహుగ్రంథకర్తయునగు

సోమరాజు రామానుజరావుగారిచే

రచియింపఁబడినది.

(ఇందలి పాటలను శ్రీ యెలుగులపాటి రామానుజులుగారు స్వరపరచిరి)

ప్రకాశకుఁడు

కంపుల గోవింద

బెజవాడ, కృష్ణాజిల్లా




మొదటికూర్పు 1000.

కాకినాడ.

స్కేప్ అండ్ కో., లో కే. సుబ్బారాయ సోదరులచే

ముద్రింపఁబడియె.

1925.



[వెల రు. 1—0—0

# ఇందలి పాత్రలు

—॥ పురుషులు ॥—

రాముఁడు

లక్ష్మణుఁడు

దశరథుఁడు

విశ్వామిత్రుఁడు

వశిష్ఠుఁడు

జనకుఁడు

రావణుడు

బుద్ధిసాగరుఁడు

ఖ్రిహస్తుఁడు

మారీచుఁడు

సుబాహుఁడు

కుశీలవుడు

శ్రావణుఁడు

విశాఖుఁడు

నారదుఁడు

సందర్భానుసారముగ శబరులు మొదలగువారు వత్తురు.

—॥ స్త్రీలు ॥—

సీత

అహల్య

ప్రమద

సుశీల

తాటకి



# సీతాకల్యాణము




## ప్రథమాంకము

దశరథుని సభామందిరము.

(ప్రవేశము—దశరథుఁడు, వశిష్ఠుఁడు.)

వశి—దశరథా! నీపుత్రమోహము చూడ నవ్వువచ్చుచున్నది!

ఆ. పవల నిశల నన్నపానీయములయందు
పాలసంబొనర్చు వేళలందు
నిదురలందుగూడ నీనోట శ్రీరామ
మంత్రజపమె తోఁచు మానవేంద్ర.

దశ—గురువర్యా! నిక్కము వచియించితిరి. అదేమి చిత్రమో కాని,

సీ. శ్రీరామవదనచంద్రికఁ గాంచకుండిన
ప్రకృతియే యంధకారముగఁ దోఁచు

కొమరు నాకృతి కౌసల్యానిజనందనుఁ బోలిన
భావంబు తల్లడపాటుఁ జెంద
నముఁగాడి రాముండు చనుచున్న నాదృష్టి
యతనిఁ గూడను బోయినట్టులుండు
తొడలపైనున్నయట్లను బేరుపిలువ, నా
గుండెలు దడదడఁ గొట్టుకొనును

గీ. నన్ను గన్నతండ్రి నాపెన్నిధానము
నన్ను గౌఁగిలించి కొన్నయపుడు
తనువు మఱచునయ్య తనయుండు విడిచిన
మొదల ప్రాణములను విడుతునేను.

వశి.—దశరథా! అక్కలము లేమలకు! అట్టి వియోగకాలమేల కలుగవలయును? అదిగాక సికిట్టి వెజ్ఞప్రేమ గలుగుట వింత గాదు.

గీ. లాభమానిసికి రణాభిలాషకన్న
భక్తునకు పరమేశ్వరాసక్తికన్న
ప్రియతరుణమైన యువకుని ప్రేమకన్న
వృద్ధజనకుని యాత్మజప్రేమ హెచ్చు.

దశ.—గురువర్యా! ఏమిహేతువో కాని సాధారణముగ లోకమున సుతులపై తండ్రులకుండు సహజమగు ప్రేమమాత్రమే కాక శ్రీరామునెడ జూపిన నే నాడు దానికన్న నన్యాయమయి పోవుచుండును. నాహృదయ మాతనిం దలంచినపుడెల్ల చంద్రకరప్రసారముంగనిన వెన్నవలె కరగిపోవుచుండును. ఇందులకు నాకే చిత్రముగా నుండును కాని, నాకుమారుడు శ్రీరామచంద్రుని వదనారవిందముం గనిన నెట్టివారికిని నెట్టిసమయములం గలుగని మహానందము గల్గుచుండును.

వశి—ఇందులకు సకలసుగుణాలంకారుఁడగు సర్వేశ్వరుని మూర్తి శ్రీరామునందుండుటయే కారణము గావచ్చును.

(తెరలో)

దేవా! విశ్వామిత్ర మహర్షి వచ్చి, ద్వారమున వేచియున్నాఁడు.

దశ—(ఉలికిపడును)

వశి—మహారాజా! విశ్వామిత్రాగమన వార్త విని యిట్లు ఉలికిపడితి వేమి?

దశ—గురువర్యా! అదేమోకాని యాతఁడు నాకు పూజ్యుఁడయ్యును నేఁడు భయస్థానమయ్యె నేమి?

వశి—నీచర్య నేఁడు చిత్రముగానున్నది. అతఁడు మనకు మాననీయుఁడే కాక నివంశీయుఁ డగుబంధుఁడుగదా! సేవకా! కౌశికమునీంద్రునిఁ బ్రవేశ పెట్టుము.

(తెరలో) చిత్తము.

దశ—గురువర్యా! విశ్వామిత్రుఁడనిన భీతితో పాటు మనశ్రీరామమూర్తియు జ్ఞప్తికివచ్చె నేమి?

వశి—నీకు శ్రీరామమూర్తి జ్ఞప్తికి రానిగడియయున్నదా?

(విశ్వామిత్రుఁడు ప్రవేశము)

విశ్వా—ఆహా! యాచనావృత్తి కడుంగడు దుస్సహమయినది గదా.

చ. నడచిన గాలు తొట్రువడు, నాల్కతడంబడు మాటలాడగా
గడగిన కంఠపూర్తియగు, కంపితమై నిలువెల్ల దేహికున్
వడకు, భయాకులంబయి వివర్ణతఁగాంచు, తిరస్కృతుండుగాఁ
దొడగిన నర్థికొక్కరికిఁ దోచు నివన్నియు మృత్యుచిహ్నముల్!

అయినను దేవబ్రాహ్మణ హితార్థమై కావించు నాయజ్ఞకార్యమునకు ధర్మపరిపాలనముచేయు సార్వభౌము నర్థించు విషయమున నంతగా వగవంబని లేదు. (ముందునకుఁ జూచి) అదుగో దశరథుఁడు.

గీ. మించి వారణవ్రజముశాసించి, నీడ
 పట్టుచేరిన మదగజం బట్టులిపుడు
 సకలభూపాలనముఁ జేసి శాంతికొఱకు
 ఈనరేశ్వరుఁడిచట నాసీనుఁడయ్యె.

ఈతనివిశ్రాంతి నిప్పుడు నేను భంగముచేయవలసి వచ్చెఁగదా! (ఆలోచించి)అవును. లోకపాలనదక్షతగలిగిన వారికి విశ్రాంతి యెక్కడిది ?

చ. అరుణురథాశ్వముల్ విరతినందవు, నిత్యము లోకయాత్రచే
 కరువలి శ్రాంతిగైకొనఁడు గాటముగా నిలపైన వీచుచున్
 అరమరలేక కాలుఁడు నిరంతరముం దన లీలనల్పు న
 ద్దిర! ఘనలోకపాలురకు తీరవు కార్యము లొక్కయప్పుడున్

[దశరథుని సమీపమునకు పోవుచున్నాఁడు]

దశ—భగవానుఁడగు విశ్వామిత్రమునీంద్రునకు నమస్కారపూర్వకమైన స్వాగతము !

విశ్వా—నిరంతరాభ్యుదయమస్తు.

దశ—దేవా ! ఈమణిపీఠం బలంకరింపుఁడు!

విశ్వా—(ఆసీనుఁడై) చిరకాలమునకు వశిష్ఠభగవానుని సందర్శించి కృతార్థుఁడనైతిని.

వశి—రాజర్షిసత్తమా! నీరాక రాకయుం బోలె మాకు గదా యానందజనకంబయ్యె.

దశ—మునిచంద్రమా! ప్రశాంతమగు నాశ్రమంబున నుండుటచే దమ కేమనస్తాపంబులును గలుగక శాంతతపోనిష్ఠానుష్ఠానంబులు నిర్విఘ్నంబులుగా సాగుచున్నవియే? సత్వక్రూరజంతువిభేదంబు మాని మీతపోమహిమంబున సమస్తప్రాణిసముదాయంబు నేకభావంబు వహించునే?

విశ్వా—దశరథ రాజేంద్రా! నాయవస్థ యేమని చెప్పఁగొందును?

(అనుబంధము ౧)

సీ. ఘనతపఃకలితులౌ మునులకు మారుగఁ
బిసితభోజనులు బుత్విక్కులైరి
ఆజ్యాదులకును బ్రత్యామ్నాయముగ నేఁడు
ప్రకటరక్తాభిషేకమయ్యె
ఖలకార్యరతినజంబుల కుమారుగ పూజ్య
వరమునీంద్రులు యజ్ఞపశువులైరి
చిరము నమేధ్య ముచ్ఛిష్ట మూత్రము లపా
రంబుగా సోమపానంబులయ్యె

గీ. వెలయుకుశలకు హోమాన్నములకు మారు
నస్థులును మాంసమును దిశలాక్రమించె
కలుషమతులైన ఘోరరాక్షసులకతన
నాదుయజనంబు నాశమైనది నరేంద్ర.

దశ—మునీంద్రా! ఏదురాత్ములు మీతపోభంగముం గావించినవారు? విజ్ఞానహీనులు భయంకరకంఠీరవకరాళవదనముం జొరసాహసించినవారు?

(అనుబంధము ౨)

విశ్వా—దశరథా! మారీచసుబాహులను నిరువురు రాక్షసులును వారల జననియగు తాటకయు నెదురేమియును లేక పెచ్చుపెరిగి

యీవిధంబున దినదినంబును నన్ను వేధించుచు తపోవిఘ్నంబున నాకు విచారముం గొల్పుచున్నారు.

దశ — మునిచూడామణీ : ఇందులకు మీకు విచారమేటికి? కాకచే వర్తమానమంపిన ధనుర్బాణసహితుండనై కావకాశ్రమంబున వారలి దుష్టదనుజసంహారంబుఁగావించి మీకు ప్రీతి గొలుపకుందునే!

విశ్వా — రాజచంద్రమా ! నీవట్టివాఁడవే కాని పెద్దతనము వచ్చిననీకు నేనంతటిశ్రమ నీయఁదలంచుకొనలేను.

దశ — మునీంద్రచంద్రమా ! అది నాకు శ్రమమెట్లగును?

గీ. తరులు ఫలదానమున గడుతసివిగనుట
శశియు భానుఁడు లోకరక్షణనలరుట
భూమిపతి లోకపాలనంధాముఁడగుట
శ్రమయనితలంపఁ జెల్లునే సంయమీంద్ర.

అయినను దేవరతపోబలమే వారివినాశకారణము కావచ్చును.

విశ్వా — అంతపనికు నక్కఱలేదు. నీయనుగ్రహమున్నచో నేనేదో విధమున వారిమరణమూ పాదించఁగలను. కాని, రాజా! నేను గ్గకోరికను హృదయమునం దుంచుకొని నీకడకువచ్చితిని.

దశ — మహాత్మా ! దివ్యతపోమహిమచే సకలాభీష్టముల నందుచు ప్రతిసృష్టిచే నపరబ్రహ్మలయినమీకుసహితము నన్నుకోరఁదగిన పదార్థములు కలవనివినుటచే నాజన్మము చరితార్థమయ్యె.

మ. మునినాథోత్తమ యీప్సితార్థమునునమ్మోదంబునందెల్పుఁడీ
ధనమో,ధాన్యమొ కాంచనాంబరములో ధాత్రీతలంబో మహా
వనసంతానములో గజాశ్వతతియో పైనేదియో వేగ లో
ననుమాసింపకభక్తిమీరఁ దమపాదాబ్జంబులం జేర్చెదన్.

విశ్వా—దశరథా! నీయుదారబుద్ధి కడుంగడు శ్లాఘనీయమైయు నది. అయినను, వనవాసులమగు మాకు కేవలతపోవస్తువులుగాని, ధనధాన్యాంబరకనక వస్తువాహనములు గాన యుపయుక్తములు గావు.

దశ—మహాత్మా! మరి మీకేమి కావలసి నాగేహముం బావనముచేసితిరి? నేను వినఁ గూడనిదా?

విశ్వా—రాజా! వినకూడనిదేమి? వివరింతును. నీవు నాకోరికఁ దీర్చుటెట్లు కాని, (సంశయించును)

దశ—దేవా! యిట్లు సంశయించుచుంటిరేమి? అదియంత యెఱుఁగఁ గూడనిదా? అట్టికోరిక మీకేమియుండును? మీకింత సంశయమేల?

విశ్వా—సంశయమేమియు లేదు. కాని, రాజా! లౌకికవ్యాపారపారీణులగు రాజోత్తములకు, రెండునాలుకలని లోకప్రతీతిగదా! యాచకుఁడగువాఁడు సగముచచ్చి, నోరుతెరచి, "దేహి" యనియడిగిన, తోడనే దాతయగువాఁడు "నహి" యనిపలికిన, మరింతచావవలసి వచ్చునేమోయని తొట్రుపడుచుంటిని.

దశ—మునీంద్రా! ఏమిది? నేనన్నఁడు వినని పలుకులానతిచ్చుచుంటిరి! శిష్యునియందింతటియపోహముగూడునే?

విశ్వా—దశరథా! నీవనినమాట నిక్కువమే కాని, సంశయించుట కీవిషయ మట్టిది.

దశ—ఆర్యా! సత్యవాక్యమున కెందైన విషయతారతమ్యము గలదే?

ఉ. ఆడదరేల మీరిటుల నార్యవరోత్తమ! వార్ధులింకినన్
బాడబవహ్ని చల్లఁబడినన్ మరిమేరునగంబు దుల్లినన్

వాడినమోముతోడ రవివశ్చిమదిక్కున నుద్భవించినన్
ఆడినమాటఁ దప్పరుగదా, రవివంశనరేంద్రసత్తముల్.

విశ్వా—సెబాస్ దశరథా! సెబాస్, చిరకాలమునకు వినఁదగి నమాట వింటిని. మనవంశగురుండగు భాస్కరుండును. నష్టదిక్కులును, వరాత్పరుఁడును, నీవాక్యము లన్యథాగాకుండ సాక్షులుగా నుందురుగాక.

దశ—(చింతనవ్యపేతో) మహాత్మా! మీదానునివాక్యములం బెద్దగాఁజేసి యింతగా వచించుచుంటిరేల?

వశి—(తనలో) ఓహో! యీదశరథుని వాగ్దానమునకు విశ్వామిత్రుఁడింతగా నలరుటకుఁదగినకారణ మేదో మహత్తరమై యుండకపోదు.

విశ్వా—మహారాజా! నేనింతగా నలరుటకుఁ గారణము లేక పోలేదు. ఏమందువా, నేనుగోరువదార్థ మట్టిది.

సీ. సకలలోకాలోకసార్వభౌమత్వంబు
నవరింపగాఁజాలు చక్రవర్తి
శేషాహితల్పంబుఁజేరి సంయముల కా
నందుఁడౌ సచ్చిదానందమూర్తి
ప్రళయంబునన్ వటపత్రశయానుఁడై
జలరాశిఁదరియించు నలఘుకీర్తి
మూడుమూర్తులు గర్భమునఁ గల్గినట్టి వి
దారికాత్మీయ భక్తవ్రజార్తి
తే. భూరితరమైన నీదు తపోవిశేష
మునవవతరించినట్టి నీముద్దుబిడ్డ

నేనువాంఛించువాగ్దత్తమిూ వానంగ
నింతకంటె నానంద మింకేదినాకు.

(అనుబంధము. 3)

దశ—(భయముతో) మునీంద్రా! ఏమనుచున్నారు? మిూరేవ నిని వాంఛించితిరి. నాప్రాణపదమునే? నాచిన్నారికూననే? నాముద్దు బిడ్డనే? నారామచంద్రమూర్తినే?

విశ్వా—మహారాజా! సందేహమేమి?

ఆ. నామయజ్ఞరక్షణార్థంబు సకల, రా
త్రించరులను సంహరింపఁజేయు
ధీరబాహుఁడైన శ్రీరామమూర్తిని
గొని చనంగవచ్చితిని నరేంద్ర!

వశి—(తనలో) ధన్యోస్మి. ధన్యోస్మి. ఏవిచిత్రదానవసంహార నాటకమునకు శ్రీమహావిష్ణువీ రామావతారమును ధరించెనో, తన్నాటకమునకు నాందీరూపకమగు నీమారీచసుబాహు వధావిధానము నీవిశ్వామిత్రసూత్రధారుఁడు గావించుశుభప్రయత్నముఁ గంటిని.

దశ—(భయముతో) మునీంద్రా! మిూరేమికోరుకొంటిరి. ఎందులకువచ్చితిరి? నాకేమియు నర్థముకాలేదు. ఏమిహేతువుచేతనో మిూరుచెప్పినమాట లొకటిరెండువినినతోడనే నాహృదయమంతయుఁ జెదినది! మెదడును మాంద్యమువహించి శరీరమెల్ల వణకుచున్నదేమి? ఏమంటిరో మరలనొక్కమారు సెలవిచ్చెదరా!

విశ్వా—(తనలో) అకటా! నేననుకొనినట్లేయయినది. అమిత పుత్రమోహముగల యీవృద్ధరాజు శ్రీరామచంద్రుని విడువఁడు. మాటజారి వెకలినైతినిగదా.

దశ—మహాత్మా! మాటాడరేమి? నావలననేమియపచార మైనది?

విశ్వా—రాజా! నీవలన నేయపచారమును గాలేదు. అపచారమంతయును నావలననే యున్నది. చెప్పుటకెంతో సంశయించిన నన్ను వేధించి నాకోర్కె యిదియని నానోటనే చెప్పించి యది నీకయిష్టమయినతోడనే నాకు వినబడ లేదనియు నర్థము కాలేదనియు మెదడు చెడినదనియు శరీరమువణకుచున్నదనియు చిన్నపిల్లవానికిఁ జెప్పి లాలించినట్లు కప్పదాటులు వేయు మనస్స్వభావముగలవాఁడవని యెఱుంగక నీకడకు యాచింపవచ్చిన నాదే యపచారమంతయును.

వశి—దశరథా! అట్లు వెకలివయి ప్రశ్నించెద వేమి? నీకేమి బుద్ధిమాంద్యమా? ఈమాత్రము జ్ఞప్తి లేదో! అతఁడు కుశికతనూభవుండు విశ్వామిత్రుఁడు. ఇది నీసభాభవనము. నీవు దశరథుఁడవు. నేను వశిష్ఠుఁడ. ఈవిశ్వామిత్రమహర్షి తానొనరించుయజ్ఞము రాక్షసబాధితమై విఫలమగుచున్నందున తద్రాత్రించరసంహారణార్థము నీకు నీపెద్దభార్యయగు కౌసల్యయందుద్భవించిన పెద్దకుమారుని శ్రీరామచంద్రుని తనవెంటఁ బంపుమని యర్థించినాఁడు. నీవంతకుమున్నే యాతఁడేదియడిగిన నిచ్చెదనని వాగ్దత్తము చేసియుంటివి. కావున నీవిప్పుడు శ్రీరామచంద్రు నీతనితో రాక్షససంహారణార్థము పంపవలయును. తెలిసినదా?

దశ—హా! రామచంద్రా! రామచంద్రా!

(అనుబంధము 4)

విశ్వా—(కోపముతో, దశరథా! అంతవిచారమెందులకు? శ్రీరాముని నాతో పంపుటకుఁ గదా నీవింతవిచారించుచుంటివి! ఇప్పుడు మానినందువలన నష్టమేమున్నది? ఒక్క వాగ్దత్తభంగమేకద? అది యేపాటిది లెమ్ము, నోటితుంపరలతో సమానమయిన వాగ్దత్త

ములనుఁ జేయు నీవంటి రాజాధముని గర్భమున జగత్పరిపాలకుఁడగు మహాపురుషుఁ డుద్భవించినందులకు మేమందఱమును, తలలు పగులఁ గొట్టుకొని, యేడ్వవలసియుండఁగా "రామచంద్రా, రామచంద్రా" యని నీవేల యేడ్చెదవు?

సీ. మాపితివా కైక వాగ్దానభంగముతోడ
సదమలసూర్యవంశప్రతిష్ఠ
సమయించినాఁడ వసత్యవాగసివరా
కృతిపూర్వభూపాలకీర్తిలతను
హాసగించినావు మాదృశబాంధవులకు దు
ర్భరమై చెలఁగు తలవంపు నేఁడు
గలిగింపఁ బడితివి ఖలకార్యములనొన
ర్చెదు నీతిబాహ్యులౌ జనులలోన

గీ. నంచితుఁడవంచు నిన్ను ప్రార్థించినాఁడ
ఖలమనస్కుఁడవని సుంత వెలియనైతి
ఛీ! యధర్మజీవితము నాశించినావు
పంక్తిరథ! నిన్నుగాంచిన పాతకంబు.

దశ—మునీంద్రా! నేనీయనంటినా? తమరంతగా దానునిపై నలుగనేల? కాని నేను మిమ్ములనొక్కటి తెలిసియు తెలియకయూ ప్రశ్నించుచున్నాను.

సీ. పాలచెక్కులపైని బరిపూర్ణచంద్రుని
హాసించు చిరుతనవ్వులరువాఁడు
ఎచటనో యాటలాడుచు నయంబున వచ్చి
యొగిరిహాయిగముద్దులిచ్చువాఁడు

అలయక గజ్జెలందెలు మ్రోయ నాడుచు
జనులకు కనువిందొనంగువాఁడు
అనఘ! యీవృద్ధాప్య మందు నామదినిఁ బా
యనిజీవనాధారమైనవాఁడు

గీ. పదియు నాలుగేండ్లింకను పైనఁబడని
సుగుణధాముఁడు నాప్రియసుతుఁడు ఘోర
జీవనములను రాక్షసులఁజంపువాఁడటన్న
సంయమీంద్రమ! వినఁగ నాశ్చర్యమయ్యె.

విశ్వా—దశరథా! నీకట్టిసంశయములక్కఁబనిలేదు. వాగ్ధత్తము నిలుపుకొనఁగలిగినవాఁడ వయితివేని పరిశుభ్రమైన రఘువంశకీర్తి కాంతకుఁ గళంకమాపాదింపఁ జాలవయితివేని, దశరథుని పత్నులకును నాల్కలకును బరిమితిలేదను లోకఖ్యాతి కెడమీయఁజాలవయితివేని నీవిట్టి తలంపులను మానుము. అసి లోకవలయునన్న దుర్మతయునకు దూరము గమ్ము. నాలుగువాళ్లు పుత్రమోహముం గట్టుకొమ్ము. తద్వియోగమోర్చుకొమ్ము. పుత్రుఁడు నాతో వడల ననుజ్ఞనిమ్ము. ఏదేవ దేవుఁడు దుష్టశిక్షణ శిష్టసంరక్షణములకయి సమస్తదానవవిరాముఁడై దేవేంద్రాదినిలింపాళిరాముఁడై లోలితభక్తసంతానహృదయారాముఁడై మునిజన నయన చకోరరాముఁడై (శ్రీ)రాముఁడై రాముఁడై నీగర్భమున నవతారముందాల్చెనో, యాశ్రీమన్నారాయణమూర్తి పట్ల బాల్యము నారోపింపకుము. మహాపాతకము. దశరథా! నామాట వినుము. సత్కీర్తిగనుము.

సీ. ఎవ్వాఁడుముదిమియు వృద్ధాప్యమును బాల్య
మును లేని దేవుఁడాయనఘుఁడితఁడు
ఆదినిమధ్యమందంతంబునందునఁ
నిండిన నిర్వికారుండితండు

కులమునాకారంబు గోత్రింబులేక స
ర్వంబు నిండిన భగవంతుఁడితఁడు
కల్పింపగాఁ బెంపఁగాఁజంపగాంచు బ్ర
హ్మాండకారణకారణుండితండు

గీ. ఖలుల వధియింపఁగా నిలవెలసెనితఁడు
బాలుఁడితఁడుగాఁడు భూపాల! సంశ
యింపకితనినాతోడఁ బంపుమయ్య
విదితముగ జగద్ధితము గావింప

దశ—మునీంద్రా! ఇంకను రామునిపంపుమని పలుకు నంశ మునందే యున్నారా! హా! రామా! రామా!

విశ్వా—దశరథా! నేను వచించినదంతయును వ్యర్థమేయయ్యెనా! రాముని బాపకుంకుటకే నిశ్చయించితివా, నివాగ్దత్తమును భంగపు చ్చుకొనుటకే, సంకల్పించుకొంటివా? జగద్ధితమహాకార్యమునకు హానినే తలపోసితివా? కానిమ్మింతయేల? ఒక్కమారు నేను వాగ్దత్తమీయలేదనియే పలుకరాదా, నేను మారాడక పోయెదను. ఏలనిట్లు తెగితెగని రీతిని ఖండించెదవు.

దశ—కౌశికమునీంద్రా! నేనట్లు గలవా? వాగ్దత్తము చేసి తప్పుకొందునా? నాకన్నతండ్రిని నాచిన్నారిముద్దుబిడ్డను, నా రామచంద్రుని ప్రార్థించిన వదలి పోవుదురేమోయని యింతగా ప్రాకులాడుచుంటిని. అట్లయిన మునీంద్రా! మరియొక ప్రార్థన. చిరుతవాఁడగు రాముఁడు చేయువనికన్న నేను విశేషించి యొనర్పఁగలనుగదా! వానికిమారుగా తమరు నన్నేల కొనిపోవఁగూడదు. ఆమాత్రము దయయుంచ కూడదా.

విశ్వా— కూడదు. కూడదు. నీవుకూడదు. రాముఁడె. రాముఁడే కావలయును. రాముఁడే రావలయును. రాముఁడే నాయజ్ఞమును

సంరక్షింపవలెను. తెలిసినదా ! దశరథా! ఎందులకిన్ని మాటలాడె దవు?

గీ. ఆదిబొంకుట మీవంశమందు నింత
వఱకు నెందునకైన గన్పడగ లేదు
ఎన్నడును లేని యపకీర్తి నిపుడుతలను
దాల్చిజీవించుటిది నీకుతగవుగాదు.

దశ—అయ్యా! ఒక్కటే పట్టుపట్టుట దయామయులగు మీకు తగవుగాదు. నేను వాగ్దత్తము చేసినది నిజమే కాని నాకుమా రుని విడువలేను. నేనే మీరని యొకమారూహించుకొనుఁడు. మాకు మీకుమారుఁడగు శ్రీరామునియెడల సమితప్రేమ గలదని యూహిం చుకొనుఁడు. అప్పుడొక మునీశ్వరుఁడు వచ్చి రాక్షసులతోఁ బోరాడు టకై పదునాలుగేండ్ల బాలునిఁ బంపుమని పట్టుపట్టినప్పుడు మీరేమి చేయుదురో యూహించుకొని యాఫణితము నేనొనర్ప నాజ్ఞాపిం పుఁడు.

విశ్వా—రాజా! ఎంతవెఱ్ఱివాఁడవు, నేనే నీవయినపక్షమున నిట్లుతలంతు నుకొంటివా? వచ్చిన ముని సామాన్యుఁడు గాఁడు. విశ్వా మిత్రమహర్షి యజ్ఞసంరక్షణమహాకార్యమునకై పిలుచుచున్నాఁడు. మహాస్త్రములన్నియు నితనికడనున్నవి. ఇంతేగాక నాకుమారుఁడు భగవంతుఁడని చెప్పుచున్నాఁడు. ఇతనిం బంపిన నేకష్టములును రా వని తలంచి పుత్రమోహము నొకమూలద్రోసి రాముని వెంట నత్యా నందముతోఁ బంపెదను. అట్లు నీవు చేయఁగలవా?

(అనుబంధము. 6)

దశ—మునివర్యా!

సీ. నన్ను మొన్నటిదాక నిగమాగమంబులే
పలుకఁజాలని పసిబాలుఁడితఁడు

పరిచారకుల పైని బాలుర పైనను
గోపించు టెఱుఁగని కుఱ్ఱఁడితఁడు
అరగంటయైన, నాయంక పాళిని వీడి
మసలని ముద్దుకుమారుఁడితఁడు
నాకన్నులకు చందమామయై మాయేను
గడయైన చిన్నారిబుడుతఁడితఁడు

గీ. దేవ! నాఁడు నేడుగావించినను బాసి
వనములందుఁ జేర్పఁ బాడియయ్యె
నన్ను గన్నతండ్రి ననువీడినంతట
నేనెటులను విడిచిపోనఁటయ్యె.

హా! మునీంద్రా! ఒక్కనిముసమైనను నన్ను బాయని నాకుమారుఁడే! అనేక పాట్లఁబడి అనేక దేవతలకు మ్రొక్కి కనిపెంచి కన్నులలో బెట్టుకొని పోషించువారము గదా కుమారుఁడే! ఎవనికి సర్వాంగములంత బాధ కలిగిన నాప్రాణములు పోయినట్లు తల్లడిల్లుచుంటినో యానుకుమారా కారుఁడే! నాప్రాణసర్వముల నాడించు గారవవానికరణి నన్ను వశము జేసికొనిన నాకుమారుఁడే! నా రామచంద్రుఁడే! అహా! ఆ రామచంద్రు నెడఁ బాసి రాక్షసులవాతంబడ వేయఁగలనా? నావలనఁగాదు. నావలనఁగాదు. మునీంద్రా! నన్ను సత్యభంగమునుండి రక్షింపుము. నాకుమారుఁగోరకుము. హా! రామా రామా! (మూర్ఛిల్లును.)

వశి — దశరథా! దశరథా! (తనలో) ఆహా! ఈతఁడు మూర్ఛిల్లియున్నాఁడు, ఈతనిస్థితి యెంత చిత్రమైనది!

గీ. పరమపురుషుని తనదు గర్భమున గాంచి
నిజసుపుత్రవ్యామోహంబను నెపము చేత
పరమభక్తాగ్రగణ్యుఁడై వరలినాఁడు
ఇతనియధ్యాత్మతత్వంబ దెంతఘనమొ!

విశ్వా—(కోపముతో) ఛీ! సత్యవాక్యపరిపాలనమహాయశం బును దిగంతముల విశ్రాంతముగావించిన సత్యహరిశ్చంద్రునివంశమును కళంకీభూతముగావింపఁబుట్టిన యీదశరథచండాలుని మొగంబు గాంచిన సకలపాపంబులు గలుగును. ఇట్టి వాని మందిరంబున నెన్ని నిముసంబులు నిలచిన నంత దురితము సంభవించును. వశిష్ఠా! చూచితివిగదా సీశిష్యుని సాంప్రదాయము! సెబాస్! గురుండవగు నీకు మంచి కీర్తి సంఘటించె. దగ్గఱ నుండియు శిష్యుని మందలింపని నీసద్బుద్ధియు ప్రశంసనీయంబు. గురుశిష్యులు రామునితో సుఖంబుగా నుండుఁడు. నేను నాయాశ్రమంబున కేగు చున్నాను.

గీ. అరయ నాత్మవంశీయుఁడవగుటచేత
బిట్టు కులనాశమౌనట్లుఁదిట్టకుండ
నీ కుశికసూతి నిన్ను క్షమించెననుచు
శిష్యునకు స్మృతి, గలిగించి చెప్పుకొనుము.

(పోఁబోవును)

దశ—(లేచి) మహాత్మా! రక్షమాం! రక్షమాం! (పాదముల పైఁబడి)

చ. అలుకవహింపకయ్య! కరుణాతిశయంబునఁ గాంచుమయ్య నా
కులము కళంకమౌనటులఁగూర్పకుమయ్య మునీంద్రచంద్రమా!
తెలియకపుత్రమోహమున ధీయుతునిన్నునిరాకరించితిఁ
చలమునువీడి నాసుతుల నన్నును వంశము నుద్ధరింపుమా!

విశ్వా—దశరథా! నీపై నాకుఁ గోపమింతయును లేదు. నేను వచ్చినకార్యము విఫలమైనది; గావున నేను చనుచున్నాను. నన్నేటి కిందుల నిలుపఁజూచెదవు?

దశ—దేవా! ఈదశరథుసర్థించి త్వాదృశులు విఫలమనోరథు లై వెడలిపోవుదురా?

విశ్వా—పుత్రుని బంపుట నావలనం గాదని నీ వనినమాట యేకాదా?

దశ—క్షమింపవలయు మహాత్మా! పుత్రమోహంబునం దెలియక యేమేమో పలికితిని.

ఆ. ముదిమిఁ గొంత, పుత్రమోహంబునను గొంత.
తెలియఁజాలకిటులఁ బలికినాఁడ
తప్పులను క్షమించి తనయుని శైవడి
కరుణతోడ నన్నుఁ గావుమయ్య.

విశ్వా—సరే! నీవు రక్షింపఁబడితివి. అట్లయిన నీవాగ్దత్తము నేమి చేసితివి?

దశ—మహాత్మా! తమరిం దాసీనులుగండు కుమారు నిప్పుడే రప్పించెదను.

విశ్వా—మంచిది ఆసీనుఁ డగుచున్నాఁడు.)

దశ—గురువర్యా! ఇపుడు నాకుఁ గర్తవ్య మేమి?

వశి—దశరథా! నీహృదయంబున సందేహము మానుము. విశ్వామిత్రునితోఁ బంపినందువలన శ్రీరాముని కేకీడునుఁ గలుగనేరదు. ఆదినారాయణుండే యిట్లు శ్రీరాముఁడై నీదుగర్భంబున జనియించెనని మునులందఱును వేనోళ్ళఁ బలుకుట వినలేదా! అదిగాక, విష్ణువే నీకు జన్మించునని నాఁడెన్నఁడో నారదుండు నీతో వచించినట్లు నీవు చెప్పియుంటివే. అట్టివాఁడ విప్పుడు సంశయించెద వేమి? తుచ్ఛులగు తాటకమారీచ సుబాహులే కారు; పదునాలుగుభువనంబులు నొక్కపెట్టున నెత్తివచ్చినను మనశ్రీరామునకు లెక్కయే?

గీ. నీసుతుండగు రాజీవనేత్ర రామ
భద్రు కుశికాత్మజునివెంటఁ బంపుమయ్య

అతని కవిధమగు నపాయంబు లేదు
ఘనతరశుభంబులను పొడఁగాంచఁగలవు.

దశ — మహాత్మా! తమయాజ్ఞయయినచో నప్పుడే యొసంగఁ జాలకుంటినా? పుత్రమోహంబు నన్నట్లాడించినది; గాని, సత్యవాక్య భంగమునకు నేనుపాత్రి మోర్తునా? (తెరవంకఁ జూచి) సేవకా! అంతఃపురమున దేవిగారి చెంగట నున్నయువరాజుగారిని శీఘ్రముగాఁ దోడ్కొనిరమ్ము.

(తెరలో) చిత్తము.

దశ — మహాత్మా! నాయపరాధము క్షమింపవలయును.

విశ్వా — రాజేంద్రా! నీవు మరిమరి వేడుకొనవలయునా? శ్రీరాముని నాతోడఁ బంపుటకు నన్నంతనే నాహృదయభారమెల్ల నశి యించె. నావంటి ధన్యుఁ డీలోకమునఁ గలఁడే?

వశి — ఇది దశరథునివిషయమున నన్వయింపఁదగినమాట.

(రామ-లక్ష్మణుల ప్రవేశము)

లక్ష్మ — అన్నా! శ్రీరామభద్రా! తండ్రిగారు పిలువనంపిన కార్యము సేవకునిముఖంబున వింటిరిగదా! మీయభిప్రాయ మేమి?

రామ — తమ్ముఁడా! లక్ష్మణా! అట్లడిగెదవేమి? తండ్రిగారి యాజ్ఞ మనకు శిరోధార్యముగదా!

గీ. ఘనవిలయసర్వనాశనకాలమందు
శాత్రవాభేద్యసంగ్రామసమయమందు
భీమదావానలాభీలవేళలందు
గురుజనులు మాననీయు లీధరణిలోన.

లక్ష్మ — అన్నా! నే నందులకడుగలేదు. నీవొక్కఁడవే పోయి వచ్చెదవా యని—

రామ—నీయభిప్రాయమేమి?

లక్ష్మ—అన్నా! ఒక్కనిముసము మాటలలోనైనను నిన్ను విడచియుండలేనివాఁడను. నీవు విశ్వామిత్రమహర్షివెంటఁ జనెదనవిన నాహృదయమున దిగులుపట్టుకొనినది. నన్నుఁగూడ నీవెంటఁ గొనిపొమ్ము. తండ్రిగారిని నేను సమ్మతింపఁ జేసెదను.

రామ—(లక్ష్మణుని కౌఁగిలించుకొని) తమ్ముఁడా! ఇది నాకు మఱెంత యానందకరముగదా?

క. తమ్ముఁడ! మునివెంటన్బోయి
పమ్ములఁ జరియింప నీవు నాతోడను మో
దమ్మున వత్తుననఁగ నా
నెమ్మన మానందసారనీరధిఁ దేలెన్.

అట్లయిన శీఘ్రముగా తండ్రిగారికడ సెలవుఁ బొందుదము రమ్ము.

(ఇద్దఱును సమీపింతురు.)

దశ—రండి నా ప్రాణములారా! దగ్గఱకు రండి.

రామ—, లక్ష్మ— } వశిష్ఠమునీంద్రునకభివాదము. విశ్వామిత్రమునీంద్రునకు నమస్కారము. తండ్రిగారికి వందనము.

వశి—దీర్ఘాయుష్యమస్తు!

విశ్వా—కళ్యాణప్రాప్తిరస్తు.

దశ—(కుమారులను తొడపై నుంచుకొని) నాయనా! రామభద్రా! పూజ్యులగు విశ్వామిత్రమునీంద్రులతోఁ జని కాననంబున ఘోరరాక్షసులను సంహరింపవలయునఁట. ఏమనెదవు తండ్రీ!

రామ—జనకా! తమయాజ్ఞకు నేనన్యథా వర్తింతునే? అగ్ని నుఱుకుమన్న నుఱుకనే? అందియు ఋషిసత్తముని చెంగట నున్న నాకేమి భయము?

చ. సెలవిడి పంపుఁ డుగ్రవనసీమను వారిజనంబు మెచ్చ, నీ
వలరఁగ కౌశికున్ మఖయాగము సాంగముగాఁగ, తాటకా

దులుపిశితాశనాఢ్యు లగుదుర్వృత్తులెల్ల నశింపదిగ్జయం
బెలమి నొనర్చి దేవ! భవదీయశుభాంకమునందుఁ జేరనే!

విశ్వా—సెబాసు. రామచంద్రా! సెబాసు.

దశ—(ముద్దుఁ బెట్టుకొని) నాయనా! నీవంతటివాఁడవే యగుదువు.

లక్ష్మ—అన్నయ్యా! నాయనగారికిఁ జెప్పుము.

రామ—తమ్ముఁడా! నీవే చెప్పుము.

లక్ష్మ—కాదు; నీవే చెప్పుము.

దశ—నాయనలారా! అది యేమి ?

లక్ష్మ—తండ్రీ! మునీంద్రుని వెంటఁ జనుటకు సోదరునకు మాత్రమే యదృష్టము గలిగించితి రేమి? నేను చేసిన పాపమేమి?

రామ—జనకా! తమ్మునిసయితము నా వెంటఁ బంపుటకై ప్రార్థించుచున్నాను.

దశ—నాయనా! నీనియోగము నే యోర్వలేనినాకు తమ్ముని విచార మొక్కటి తెచ్చిపెట్టెదవా తండ్రీ!

లక్ష్మ—తండ్రీ! నేనుమాత్ర మన్నగారిని విడిచి యుండఁగలనా?

వశి—దశరథా! లక్ష్మణుఁ డెప్పుడును రామునిఁ బోటివాఁడే. కావున, నాతనిసయితము కౌశికునితోఁ బంపుము.

గీ. అరయ బ్రకృతియు పురుషునియట్లు నాత్మ
యుఁ బరమాత్మునిగతి పురుషోత్తమునకు
శేషునకు, వియోగం బొందఁ జెలఁగదయ్య
వారియంశల జనియించినారు వీరు.

దశ—దేవరయాజ్ఞాబద్ధుఁడను. (ప్రకా) నాయనా! అట్లే పోయి రమ్ము.

రామ — తమ్ముఁడా! తండ్రిగారికరుణను సెలవొసంగునా?

విశ్వా — శ్రీరామచంద్రా! నాయదృష్టమున మీరిరువురిని సన్మానించు భాగ్యముఁగంటిని. మనకు కాలాతీతమైనది. వేగముగఁ బ్రయాణముగందు.

రాము — దేవా! మాజననులతో నీవార్తం దెలిపి వారిసెలవు నందివచ్చెదము. ఒక్కనిమునను క్షమింపుఁడు. తమ్ముఁడా! రమ్ము.

అనుబంధము 6

దశ — దేవా! కుశికనందనా! సమస్తము నెఱిఁగినవాఁడవే యయ్యును నాకుపుతీపిచే చెప్పుచున్నాను. వీరినెట్లు కాపాడెదవో?

విశ్వా — దశరథా! నీవు నాకిది వేఱుగాఁ జెప్పవలెనా?

దశ — దేవా! మనము నయితము గోపులకేగి యభ్యంతర మందిరమునుండి ప్రయాణము సాగింతము రండు.

విశ్వా — }
వశి — } అట్లే కానిమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము సంపూర్ణము.





# సీతాకల్యాణము

## ద్వితీయాంకము



### రంగము 1

—అడవి—

(అట్టహాసముతో తాటక ప్రవేశము)

(అనుబంధము. 7)

తాటక — (తనలో) ఆహా! చిరకాలమునకు నాకీవనమున, మనుష్యవాసన తోచుచున్నది. ఈదేశమందలి సమస్తమానవమాంసమును మెక్కి జొన్నపొత్తులనువలె, విఱిచికొని కణకణలాడు నిప్పులపై పెటపెటవేపుకొని క్షుద్బాధదీరునట్లు కడుపారభక్షించుచు బానలకొలంది నులివెచ్చని నెత్తురు గడగడ ద్రావి మహానందమున నుంటిని. కొన్నినాళ్ళకీదేశమెల్ల నిర్మానుష్యమై యరణ్యంబులు పెరిగినవి. నరుల మాంసమిప్పుడు కఱవై మృగంబుల తిండియే మెండయినది. నాకుమారులు మారీచసుబాహులు తిండిపెట్టువేళ కాలస్యమైనది. ఈమనుష్యవాసన యేదో, పొడగని గుటుక్కున నాపొట్టను వేసికొందునా! (ముందుకుచూచి) ఆ! అదిగో, నాకుమారులగు మారీచసుబాహు

లిచ్చుటకే వచ్చుచున్నారు. వహ్వా! వహ్వా! వీరెంతమాంసమును నెంత నెత్తురును నాకొఱకై తెచ్చుచున్నారు. కుమారులన్న వీరేకుమారులు. నేడు నాకు పండువుగదా?

(అనుబాధము 8)

(మారీచుడు-సుబాహుడు గిన్నెలతో ప్రవేశము.)

(అనుబంధము 9)

మారీ—తమ్ముడా! సుబాహుడా! అమ్మగారిభోజనమున కింత యాలస్యమేల చేసితివిరా మూర్ఖుడా!

సుబా—అన్నయ్యా! విశ్వామిత్రుని యాశ్రమమున నేడేమి చిత్రమో కాని మామూలుగా విచ్చలవిడిగా, మునిముండకొడుకులు చేతికి దొఱుకుటకు మారుగా నెక్కడను దొరకవలెను. వేఱొకచోట నింతవఱకును సంపాదించుటకు ఇంత యాలస్యమైనది.

మారీ—హు! తమ్ముడా! ఏమి! ఆమునిముచ్చులకింత పోతరమా? ఆదురాత్ములేదో కపటోపాయములు కన్నుచున్నారు. తమ్ముడా! ఆ పారుబోతులీమారు కనబడినప్పుడు ప్రాణములుండగా శరీరములను పీకుకొని యుప్పులో నద్దుకొని కొంచెముకొంచెముగా తినవలయును. అప్పుడుగాని వారికి బుద్ధి రాదు.

సుబా—నిజము నిజము. వారికేదో యొక ప్రాయశ్చిత్తము చేసి తీరవలసినదే.

తాట—ఓహో! కుమారులారా! మారీచసుబాహులారా! నాకాకలివేళమీరినదిగదా! ఏదీనాయాహారము, ఏదినాయాహారము!

మారీ—అమ్మా! ఈపాడుమనుష్యులు మనలను చూచినంతనే క్రమముగా పారిపోయి యెందెందో దాగుచున్నారు. నేనెంతో కష్టపడి, నీకీనంజుళ్ళు సంపాదించితిమి, చూడు చూడు.—

సుబా—అమ్మా! తాటకీ! ఇదిగో యీశరీరము కాశ్మీరరాజు మూఁడవకుమార్తెది ఆబాలిక యీనాఁడు తన చెలియండ్రతో పూవులకోయుటకై తోఁటలో నొంటరిగా కూర్చుండి యుండఁగా నేను దానిచెలియని వేషము వేసికొని దానిని మోసగించి దూరముగా నడవిలోనికిఁ దీసికొనివచ్చి చంపి నీకొఱకై తెచ్చితిని.

తాట—హాహాహాహాహా సెబాసుకుమారా! సెబాసు ఎంతపనిచే తరరమగునట్లు చేసితివి! నీవుగదా నాకుమారుఁడవు ఏదీ ఒక్కముద్దు. ఏదీఒక్కముద్దు! (ముద్దుపెట్టుకొనుచున్నది.)

మారీ—హాహాహాహా తమ్ముఁడా సుబాహూ! అకటదానితో నీవు సరసమాడితివి గావలయును. (పెద్దగానవ్వుచున్నాఁడు)

సుబా—అన్నయ్యా! సరసమాడితినిగాని పాడుముండ నారసికత తెలిసికొనలేక యేడ్వమొదలుపెట్టినది. హాహాహాహాహా.

తాట—హాహాహాహాహా. ఏమిచిసదా తెలివితక్కువముండ? ఇంతసౌందర్యవంతుఁడగు నాకుమారునికన్న దానికెక్కువమగఁడు దొరకునా! నాగరికత తెలియని మోటుమనుష్యులకు శృంగారమేమి తెలియును? హాహాహాహా.

సుబా—అమ్మా! తాటకీ! ఆకోపముతీరునట్లు దీనిని నీవాఁడి కోరలతో కసకసనమిలి తినివేయుము.

తాట—భళీ! కుమారా! భళీ. నాకు చక్కనివిందు చేసితివి. పిండివంటలలో సుఖముగాఁ బెరిగిన యీరాచపిల్లను కమ్మగా భక్షించెదను. ఈశవములన్నియు నెవ్వరివి?

సుబా—ఇది సింధురాజు సేనానాయకుని కళేబరము! ఇవి మాళవదేశపురాజు నలువురుకుమారులశరీరములు. ఇవి వారి గుఱ్ఱములు. ఇవి వారికుక్కలు. ఇవి వంగదేశపువర్తకులశరీరములు. ఇవి ఘూర్జరదేశపుదొంగలగుంపుల యొడళ్లు

తాట—చాలుచాలు కుమారా! ఇంక చెప్పనక్కఱలేదు, అట్లయిన నీదినములు నొక్కసన్యాసి శరీరమైన కనఁబడలేదేమి?

మారీ— అన్నా! ఆమునులందఱును కనఁబడకుండ పారి పోయిరఁట.

సుబా—అమ్మా! వారిజాడ యెందునుఁ గానరాలేదు.

తాట—హుం! కుమారులారా! ఆబైరాగులు కనఁబడనే లేదుగా? ఆనరకీటకముల కింతమదమా! పొండు, వారెచ్చటనున్న నచ్చటకుఁ బోయి కపాలములను బ్రద్దలుచేసి, నెత్తురంతయు త్రాగి వారిశరీరములను నాకాహారముగా నిండు. నేనితిండిలో నిప్పటికాకలి చల్లార్చుకొనెదను.

సుబా—అన్నా మారీచా! రమ్ము. మనదండులో నిప్పుడే పోయి వారిపని దూలింతము రమ్ము.

మారీ—రమ్ము. తమ్ముఁడా! రమ్ము.

(అనుబంధము 10)

(అందరు నిష్క్రమింతురు.)

(రంగము 2)

(ఒకఅడవి-సరయూనదిప్రాంతమున)

విశ్వా-రామ-లక్ష్మ-ప్రవేశము.

విశ్వా—రామలక్ష్మణులారా! అల్లదే భాగీరథీతీరము. నేత్ర పర్వమై యొప్పుగాన్పించుచున్నదో కంటిరే.

చ. హరికమనీయచారుచరణాంబుజసన్నికరందమై మహే
శ్వరగురుకేశబాధతలసాంద్రవియత్పథవేగగామియై

వరనగరార్ధభూమితలవాహినియై యఘుకోటి మాన్పఁగాఁ
గరమువ్రీలంబుబూనినది గంగ తరంగశుభాంతరంగయై.

ఈగంగాతీరమున నీకు శత్రువిజయకారణంబులగు బలాతిబలలను విద్యలను నేర్పెదను. నీకిది భద్రకవచమై యుండునుఁగాక.

(ఉపదేశించుచున్నాఁడు)

రామ—మహాత్మా! తమమహోపదేశమున ధన్యుఁడ నయితిని.

విశ్వా—కుమారులారా! మనము పూజ్యవాహినియగుగంగా భవాని నొక్కమారు వినుతించి యందునకుఁ బోవుదము.

రామ }
లక్ష్మ } దేవరయానతి.

(అందరును ధ్యానించుచుండఁగా)

(11 అనుబంధము.

విశ్వా—

గీ. హరున కర్ధాంగి! శీతశీతకరతరంగి
యమలశుభజలగంగ! శుభాంతరంగ
కలితగంభీరవాణి! గంగాభవాని!
కరుణ విదజల్లి మముపొడగాంచు తల్లి!

రామలక్ష్మణులారా! మన మిప్పుడీగంగానది నతిక్రమించవలయును. తీరమునకు బోవుదమురండు.

(సమీపించుచున్నారు.)

(అప్పుడు నలుఫ్వురు కబరులు ప్రవేశము)

1కబ—ఒరే, పొద్దున్న నిద్దుర లేచిన కాణ్ణుంచొక్క బేరమైనా తగల నేదురా!

2శబ—దూరాన సూడన్నే! ఒకనన్నాసా డిద్దఱురానకురో్రి ళ్లతోటి వత్తున్నాడుసా.

3శబ—గడలట్టుకోండిరా, సారానీళ్లకై నా దొరుకుతది.

విశ్వా—శబరులారా, వీరు దశరథనందనులు, రామలక్ష్మణులు, మమ్ములనావలకుఁ జేర్పవలయును. వలయు ధనమిచ్చెదము.

1శబ—ఓరేయి, రాజుగారి కుమాళ్లురోయి, దబ్బిచ్చుకుంటే సంపేత్తారు గామాలురా!

2శబ—నువ్వుండన్నే యొక్కి మొగమా. రాసోరు గొప్పబహుమానం సేత్తారురా!

రామ—(చిరునవ్వు నవ్వి) శబరులారా, మీకు విశేషబహుమానము చేసెదము. మమ్ము దాటింపుఁడు.

2శబ—అబ్బెంతర మేటి! బాబూ. రండి,రండి.

శబరులు పాడుచు పడవమీద దాటించును)

—(౦)—

రంగము:— అడవి

విశ్వా-రామ-లక్ష్మ-ప్రవేశము.

రామ—దేవా, ఈయరణ్యం బింత నిర్మానుష్యముగా నున్న దేమి?

విశ్వా—రామభద్రా, ఇవి పూర్వము మలద కరూశంబులను రెండు బహుజనసంకీర్ణ దేశంబు లయియుండెను. కాని కాలక్రమంబున, తాటకయను క్రూరదానవి వలనను, దానితనయులగు మారీచసుబాహులవలనను నివి నిర్మానుష్యంబులుగా నొనర్పఁబడి యిప్పుడు మనుష్యదుర్భద్యారణ్య ప్రదేశంబు లయియున్నవి.

రామ— మహాత్మా! అంతటిక్రూర దానవులు నిక్కముగా శిక్షింపఁ బడఁదగినవారే.

లక్ష్మ— వారిప్పుడే, కాన్పించియుండినచో శిక్షించి లోకంబులకు, ప్రీతిఁగొలుపకుందుమే?

(12 అనుబంధము.)

విశ్వా— రాకుమారులారా! తొందరపడకుఁడు, ఆతాటక నివసించు వన మిదియే. కావున దానిని వధింపఁదగిన కాలమును, సమాసన్నమైనది.

(తెరలో)

ఓహో నరకీటకములారా! ఎవ్వరురా మీరు? లోకైకభయంకరమగు నీతాటకిం జూచినంతనే లోకంబులెల్ల గడగడ వణంకుచుండ నిర్భయముగా నీవనంబు జొచ్చితిరి, ఓరోరి యదృష్టహీనులారా! మీరింక నెందుఁబోవఁగలరురా! నిలుఁడు. నిలుఁడు. నేనిదే వచ్చి, మీతలలు పగులఁగొట్టి, పచ్చిమాంసమును మద్యమున ముంచుకొని భక్షించెదను.

రామ— కౌశికమునీంద్రా! ఆభయంకరమైన కంఠస్వర మెవ్వరిది?

విశ్వా—

గీ. అదియె తాటకి, సకలలోకైకభయద
కృత్య చతుర్దశ భువన భీత, భీమ
సంక్షుభిత కాళికామూర్తి సమరమందు
దీని మడియించి సత్కీర్తిఁ దెమ్ము! తనయ!

రామ— దేవా! ఇట్టి యధర్మకార్యమున నాకు నదేశికా

జెల్లునే! స్త్రీజనంబులను, వృద్ధులను, బాలురను, సుప్తులను, రోగులను, వధించుట మహాపాతక మని శాస్త్రదృశులు వచింతురే.

(13 అనుబంధము.)

విశ్వా—రామభద్రా! అట్లుగాదు. ఇట్టి విషయసందర్భమున ధర్మసూక్ష్మ మరయవలయును. చూడుము.

ఉ. మానిని గాగ లోకతతి మారణ జేసెడు శక్తిగాని. యీ
దానవి దీనిమూలమున ధర్మమునాశనమయ్యె; లోక సం
తానము దగ్ధమయ్యె, గుణధన్యులు మానిజనంబులెల్లరో
మానవనాథపుత్రి! పరిమార్పుము పాపము గల్గదింతయున్.

రామ—మహాప్రసాదము.

(అప్పుడు తాటకి ప్రవేశించుచున్నది.)

తాట—ఓరోరి నరకీటకములారా! నడపీనుగువంటి యీముని ముచ్చిద్రా మిమ్ములను రక్షించునా! మీరిద్దఱును నాయొక్క పంటి క్రింద కబళంబునకుఁ జాలరే! మీకీ సాహసమేటికి. ముద్దుగారుచున్న మీవదనంబులఁజూడ, నాకు గడువిచారము గలుగుచున్నది. పొండు, పొండు. మీయమ్మకడ పాలు త్రాగుఁడు.

రామ—ఓపాపిని! లోకనాశని! నీకు మాపై జాలిసయితము గలదా! జాలిగలదానవేని యీలోకనాశనం బెట్లుగావించియుందువు?

లక్ష్మ—కలుషస్వరూపిణి వగునిన్నుఁ బరిమార్చి, లోకహితంబుగావింపుమని గురునాథులయాజ్ఞ యయినది. నిన్నొక్క క్షణమయినను క్షమింపము.

(14 అనుబంధము)

తాట—ఓరోరీ! దురాత్మపదులారా! రాచపీనుగులారా! ఏమిరా మీకిందఱకొవ్వు? చెడెదరని పల్కిన నాపల్కులకు పెద్దపెద్దమా

టలాడుచున్నారు. అట్లయిన దుష్టు జాలిదలంపక నిర్దయుఁడనై యము నింటికిఁ బంపెదను.

విశ్వా—రామలక్ష్మణులారా! ఎంతసేపీదానితోడ నిరర్థక వాదము. వేగముగ దీని గీటడంచి లోకహితంబు చేయుఁడు.

రాము—మహాభాగ్యము (బాణముతో కొట్టగా)

(తాటక మృతినొందుచున్నది.)

(పుష్పవర్షము కురియును)

(ఆకాశమార్గమున దేవదూతలు కాన్పించి)

దేవ—రామభద్రా! లోకకంటకియగు తాటకిం బరిమార్చి, లోకభద్రంబు చేకూర్చిన నీకు కల్యాణమగుఁగాక! యని దివిజులు సందేశము నంపిరి. నీకు శుభంబగుఁగాక,

(అదృశ్యమగుచున్నారు.)

విశ్వా—వత్స! శ్రీరామభద్రా! నీసాహస మద్భుతమానముగదా.

సీ. మేటిదానవియైన తాటకిఁబరిమార్చి
భువనసంతానంబుఁ బ్రోచినావు
కడలేని రాక్షస కల్లోలము నణంచి
సంయములకు మేలు సలిపినావు
చిన్నారిపొన్నారి చిఱుతప్రాయమునందె
బాహువీర్యంబు గన్పరచినావు
అనదృశంబుగ చతుర్దశభువనంబుల
మోదవారిధిలోన ముంచినావు

గీ, లలితరవివంశసత్కీర్తి నిలిపినావు,
ఘనసిలింపులసంస్తుతి గాంచినావు

విశ్వహితకార్యములనుఁ గావించినావు
రమ్యగుణగణసాంద్ర! శ్రీరామచంద్ర!

రామ—మహాత్మా! శిష్యునియందలి యవ్యాజకరుణచే మీ రీట్లు తలచుచున్నది; గాని నేనింతగావించిన విశేషములేదు.

విశ్వా—రామచంద్రా! జగన్నాథునియవతార మవని ఋషుల చేతను, దేవతలచేతను మహాకీర్తనీయమనకిది యొకవిశేషము గాకుండు టెట్లురమా! ఇనను ప్రాకృతులమగు మాకీదినము మహావిశేషదినము! జగదానందదినము. అల్లదే యంబరమార్గమున వీక్షింపుము. వియచ్చరులెట్లు గాలుండవగు నిమహాసాహసమున నాశ్చర్యపుల కాంకితులై ముక్కులపై వ్రేళ్లిడుకొని చూచుచున్నారో! ఈదవ్వునసే నాయాశ్రమముగలదు.

మ, అదిగో పొంతలవాలమందఁ గనువింపైతోఁచు; తత్కంఠమం
దదరన్ ఘంగనుఘంటనాదము; కుశాహారుల్ వటుల్ గాంచు మ
ల్లదె! నీవారపుటన్నముం దెదవు భవ్యంబై నెత్తావులన్
మదికింపై యొసగెం బ్రశాంతవనసన్మాహాత్మ్య మొప్పారఁగన్,

(అందఱు నిష్క్రమింతురు)

రంగము 4

ప్రదేశము—విశ్వామిత్రాశ్రమము

వసంతుఁడు—కుశీలవుడు ప్రవేశము.

వసం—ఓరినిద్రపోతా! లే! కన్నులు తెఱవుము. ఇంతదూరము లాగి కొనివచ్చినను నీకన్నులింకను తెఱచికొరాలే దేమి పాపము!

కుశీ—ఎవరు? నారాయణా!

వసం—ఓరినీయిల్లు వల్లకాడుగాను. ఇప్పటికిని నేనెవ్వఁడనో తెలియలేదా! నారాయణుఁడు నెలదినముల నుండియు వాశ్రమములో లేఁడు కలవరించుచుంటివా! నేను వసంతుఁడను.

కుశీ—ఓహో వసంతుఁడా! అబ్బబ్బా; చంపితివోయి! పూర్తిగా తెల్లవాఱనీయకుండ నాయెముకలు కొఱికి లేవఁగొట్టుకొనివచ్చితివి! ఏమిరాచకార్యము వచ్చినది ?

వసం—కుశలవా! తెలివిమాలిః భగవంతుఁడు దివారాత్రివి భాగముచేసి సీతిరసికీడు గావించినాఁడు సుమా !

కుశీ—కీడన్నకీడా ! వసంతా! తెల్లవాఱుజామునసే మనయాశ్రమమునందలి ఋషికుమారులు జపములని, స్నానములని, అగ్ని కార్యములని, గణగణచప్పుడు చేయుచు, బావురుబిల్లులవలె వేదములు వల్లెవేయుచుండఁగా, వీరివందఱి నొక్కమారాయమధర్మరాజునకు దయవచ్చి లాగుకొనిపోయినాఁడు గాఁడని విచారపడుచుందును.

వసం—యమధర్మరాజేంద్రులకు ! ఈరాక్షసముండకొడుకులు క్రమముగా నాశ్రమములన్నిఁటిని ఫలాహారము చేయుచునేయుండిరి గాదా కాలో! రాక్షసులపేరువిన్న నాకమితభయముగదా వసంతా! ఒకవేళనిప్పుడు తిరిగిరాక్షసుల యల్లరి పుట్టలేదుగదా ?

వసం—సరిసరి ! అట్లయిన నీవేమియు నెఱుఁగవసిన మాటయే.

కుశీ—ఏమిజరిగినది ! ఏమిజరిగినది !

వసం—మనగురువుగారైన విశ్వామిత్రమహర్షి కొన్నివాళ్లక్రిందట నయోధ్యకేగిన వార్తయయిన నెఱుఁగుదువా లేదా !

కుశీ—ఎఱుఁగుదును. కాని ఎందులకు వెళ్లినారో తెలియదు.

వసం—నీనిద్రయేమో నీవేమో కాని వేఱుప్రపంచము తెలి

లేదా, లంకాపురములో నెవంటి నెవరో పోతే యొకఁడు రావణుని తమ్ముఁ డున్నాఁడఁట. మొన్న నారదముని మనయాశ్రమమునకు వచ్చినప్పుడు వానికథయే చిత్రముగాఁ జెప్పి కడుపుబ్బ నవ్వించినాఁడు.

కుశీ—నాఁడొకవేళ వారు పెద్దన్నయ్యగావచ్చును. కాని, విశ్వామిత్రమహర్షి వృత్తాంతమును జెప్పుము.

వసం—దశరథమహారాజకుమారులయిన రామలక్ష్మణులను మనగురువుగారు రాక్షసులను సంహరింపఁజేయుటకై తీసికొనివచ్చినారు

కుశీ—ఎవ్వరిని? నిన్న మన యాశ్రమమునకు వచ్చిన చక్కని పిల్లలా?

వసం—అవును వారే.

కుశీ—అబ్బా! అలాగునవా?

వసం—ఏమి! గుండెచెదరినదా?

కుశీ—లేకుగాని తాటకి వేలుగణిపెను లేని కుఱ్ఱవాండ్రు రాక్షసులందఱను సంహరింపఁగలరా! యని తెల్లపోయినాను.

వసం—ఓయి జ్ఞానహీనుఁడా! వారు తాటకినే సంహరించి వచ్చినారు! ఆ తాటకకుమారులు లేమి లెక్క?

కుశీ—ఊరకుండు. అదేమో విననిమ్ము.

(తెరలో)

శ్లో. దానవులారరండు! పరివారుణ మీసమకూరెనిప్పుడీ
మానవకీటకాధముల మ్రిందఁగఁజేయుఁడు రక్తమాంస సం
తానము హోమశాలల నదల్పుఁడు కుల్పుడు వైరిశీర్షముల్
మానుల కంఠము ల్దునిమి మాంసము రక్తము దాఁపుఁ డుద్ధతిన్.

కుశీ—(విని) వసంతకా! రమ్ము. రమ్ము. ఈదానవుల బారినుండి వేగముగ బయటఁబడుదము.

వసం—అట్లే పోవుదము. (నిష్క్రమించుచును.)



# సీతాకళ్యాణము

## తృతీయాంకము.



(ఆశ్రమ పరిసరము—ధనుర్బాణములతో

(రామ-లక్ష్మ. ప్రవేశము)

లక్ష్మ—అన్నా ! క్రూరదానవవాగ్భాటము లప్పుడే మిన్ను ముట్టుచున్నవి. ఆలకింపుము.

రామ—లక్ష్మణా ! మాకేమియు భయములేదు. రాత్రించర లోకమునకు నేటితో నాయువు తీరినది. నీవు సంసిద్ధముగ నుండుము.

లక్ష్మ—సిద్ధముగా నున్నాను.

(శ్రావణ, విశాఖులను నిద్దఱు మునులు ప్రవేశము)

(అనుబంధము 15)

శ్రావ<br>విశా } శ్రీరామ సౌమిత్రులారా? విజయతాం. విజయతాం.

రామ<br>లక్ష్మ } మునీంద్రులకు ప్రణామములు.

శ్రావ—కుమారులారా

ఉ. బాలురు మీరు దానవులభండనముజ్జ్వలమై పొసంగుభూ
పాలకుమారులార! మిముఁ బాయుట కానరనాథుఁ డెంత యో
జాలము జేసెనంట విధిసంఘటనం బెటుగంగరాదు మీ
రాలములోన దానవులయందున జాగ్రతగా మెలంగుఁడీ.

విశ్వా—రామలక్ష్మణులారా.

చ. పలుకఁగరాదు మీరు పసిపాపలుగావున మీపరాక్రమం
బలఘు మహాత్మ్యసమ్మిళితమై భువనంబుల నాక్రమించెనా
ఖలమతి తాటకం దునుము కార్యము కార్యముగాదు తత్కుమా
రులు బలవంతు లీరణమె రుద్రభయానక మౌనునమ్మడీ.

శ్రీవ—శ్రీరామభద్రా! విశ్వామిత్ర మహర్షి శుచిర్భూతుఁడై యాగవేదిక నధిష్ఠించియున్నాఁడు. పలలరక్తాస్థి సంఘంబులతోడ రాక్షసాధములు విచ్చలవిడిగా నాశ్రమంబున నంతటను సంచరించుచు మునిదంపుల యమదండసన్నిభములగు దండంబుల సంహరింతురు. కావున నామునీంద్రుని సందేశమును వినుము.

రామ—వినమితుఁడనై యున్నాను.

సీ. రక్తమాంసపురీషరాసులు హోమాగ్ని
నధిక హేయముగ జల్లార్పకుండ
దారుణంబగురీతి దానవార్భాటముల్
మితిలేక జన లాక్రమింపకుండ
పైనబట్టలువీడి, బైరాగిదండులు
కట్టాయనుచు గోలపెట్టకుండ
సదమల మగునసూచానదీతపోవ్రత
గరిమ కెంతయు హానిగల్గకుండ.

గీ. ఖలమతులు దానవులువృద్ధి గాంచకుండ
నెట్లుగాతువొ? పంక్తిరథేంద్రతనయ

కాలుఁడ నటంచు గాఢదిట్టిభారమిడుట
దేవుఁడవటంచుఁ దలఁచి వర్తింతు నయ్య.

విశ్వా—అబ్బాయి ! నీవు దేవుఁడవైనను రాముఁడవైనను ప్రకృతము మానవగర్భసంజాతుఁడవే కావున నా వెఱ్ఱిసైతము తీరుటకు రాజసభీతిగలుగకుండ నీయణికెక్కు శీఘ్రదీక్షవచనము కట్టనిమ్ము.

(యిద్దఱు రక్షించుచున్నారు.)

రామ—మునీంద్రులారా ! మాదృశులగు వీరకిశోరములకు తమవంటివారి యాశీర్వచనములే సర్వభద్రములుకదా—

శ్రీవ—రామచంద్రా ! మేముఁ యాగశాలకరిగెదము నీవు సభ్రాతృకముగా నధిజ్యశరాసనుండవై రాజసభయము రాకుండఁ జూచుచుండుము.

రామ—చిత్తము,

శ్రీవ }
విశా } నిష్క్రమింతురు

రామ—వింటివే సౌమిత్రీ ఈ మునుల కలుకులు బిగ్గరాం తపోభంగమువలనఁ గలిగిన తాలమటమంతయు పలుకులం దలచూపుచున్నవి.

లక్ష్మ—అన్నయ్యా! వైదికులై వేదాధ్యయన పారాయణపరాయణులై ప్రశాంతమాగ కాలముఁ బుచ్చు నీమనసులెక్కడ! సంతతము మనుజమాంసాశనమే వృత్తిగాఁగల నిశాచరాధములెక్కడ! అదానవుల యార్భటి వీరినింతగా సంక్షోభపెట్టినను నీవు వేరుగా నుడువనేల?

రామ—తమ్ముఁడా ! ఎంత వెఱ్ఱివాఁడవు! మహాత్ములగు ఋషులనిములగు క్రూరదానవులకే చాలఁగనుకొంటివా ! విను.

సీ. క్రూరదానవుల నిర్ఘోషంబులకుఁ జాలు
శాంతశీమానుల శాపంబు

అసురాంగభీకరశస్త్రాస్త్రంబులకుఁ జాలు
తాపసజనముల దర్భపుల్ల
భీకరరక్తాభిషేకంబులకుఁ జాలు
నుజ్జ్వలితకమండలోదకములు
అలఘయాతుధానాట్టహాసంబులకుఁ జాలు
వరమునీశ్వరులభ్రూభంగ మొకటి
గీ. తాటకినిసంహరించి తత్తనయయుగిని
బోరఁడించుట వారితపోవిశేష
మాత్రమునఁ గాక, తమ్ముఁడా! మనకు తద్వ
శంబు సమకూర్పఁదలఁచిరి సదయులగుట.

అంతేకాని, విశ్వామిత్రమహర్షితపోబలమే పనిచేయనిచో, తాటకాదులను కిన్నెలు దెలియని మనము సంహరింపఁగలమా ?

(తెరలో)

ఓహోహో! తమ్ముఁడా! సుబాహూ! శీఘ్రముగా రమ్ము! ఓహో! అస్థిచర్మావశేషులగు నీమునిముచ్చుకొడుకులు తమ్ము రక్షించుకొనుటకై మనమొదను కాలపిక్కరోమములంత లేని పసిరంగలను కూడఁగొట్టి యజ్ఞమంటపమునకు వాటముగఁ గాపుఁ బెట్టినారు. హుం! తమ్ముఁడా! ఈపసిరండలు రాజకుమారులవలె నున్నారు. పిండివంటలతోఁ, నేతులతోఁ, బెరుగులతోఁ బెరిగిన ప్రాణములుగనుక మిక్కిలి రుచిగా నుండును. చెరి యొకకబళము చేసికొని యెదుర మ్ము.

లక్ష్మ—(విని) అన్నా రాఘవా! అదిగో పాపాత్ములగు దనుజుల యార్భాట మప్పుడే శ్రవణగోచర మగుచున్నది. సరిగా నది యీ దక్షిణదిక్కుగా నుండి వినఁబడుచున్నది. నన్ను వదలుఁడు. ఆదుష్టుల నిప్పుడే సంహరించి మీకందఱికి నమితానందముఁ గలిగించెదను.

రామ—(కట్టుకొని) తమ్ముఁడా ! నీ వట్టిపరాక్రమశాలివే యగుదువు. కాని, యిప్పుడు వచ్చినతొందర యేమి? ఇంచుక శాంతింపఁగూడదా? క్షణములో నారాత్రించరు లిచ్చటికే రానై యున్నారు.

(అట్టహాసముతో సుబాహుఁడు ప్రవేశము)

సుబా— ఓరీ! నరపురుగులారా! దేవదానవమానవాదులలో నింతకుమున్ను మమ్మువిరోధించఁ బలశాలి యెవ్వఁడును లేఁడు. పూర్వాపరసందర్భము తెలియంగక మాచే నిష్కారణముగ చావ నెంచివచ్చిన మీస్థితిఁ జూడ నాకు మిక్కిలి విచారము గలుగుచున్నది. మీయమ్మకడ చనుబాలు త్రాగుచుండవలసినస్థితిలో నిటు తేలవచ్చితిరి? పొండు.

రామ—ఓరోరీ మానవహంతకా!

ఉ. బాలురఁ బట్టి తెచ్చుటయొ? బ్రాహ్మణవర్యుల బాధసేయుటో?
బాలురఁ జంపుటో? యజనభంగ మొనర్చుటో? విష్ణుభక్తులం
జాలగ హింసచేయుటయొ? జాల్మఁడ! రామునితోడ పోరు నీ
కాలముదీరె ప్రళయకాలము చేరెరె దానవాళికిన్.

లక్ష్మ—ఆసన్నయమపురకవాటుం డవగు నీకాటుండవు. నీవు మాప్రాణములకై జాలి నొందుచుంటివా? ఛీ! తులువ!

చ. తపములమిక్కుటమ్మగుచు తాపసలోకముఁగొట్టి సంతతం
బపగతలజ్జులై తగుకులాంగనలంబడనెట్టి బాలురం
గృహవిడనాడి మట్టి తమకించి నిరంకుశలీల లోకముం
విపథముచేసినట్టిమిము వే శకలంబులు సేతు మిప్పుడే.

సుబా—ఆఁ! ఏమి విచిత్రము! పిట్టకొంచెము కూఁతఘనము సినట్లు ఒకచెంపఁ గొట్టిన పాలు—సింకొకచెంపఁ గొట్టిన నీరు గారు పసికందులు పెద్దమాట లాడుచున్నారే! వీరికొకవేళ వివాళకాలము సమీపించినదేమో! ఓహో! బాలకులారా! ఏమి మీవాచాలత? ఏమి

బుద్ధిహీనత? మీసాహసము వాలకించిన నాకు నవ్వువచ్చుచున్నదే! చిఱుతలారా! మీరిరువురును నాకొక్కకబళమైనను గారే.

రామ—ఓరీ! రాక్షసాధమా! నీవు మమ్ము కబళంబులనుగాఁ జేసికొనెదవో నిశితంబులగు మాసాయకంబులే నిన్ను కబళంబుగాఁ జేసికొనునో క్షణకాల మోర్చి యుండుము.

సుబా—బాలకులారా! రాత్రించరులబాహువులచవి నెఱుంగక మాటలాడుచున్నారు. ఇదిరాక్షసులతోటి పోరాటముగాని, బాలురతోటి సయ్యాటకాదు.

లక్ష్మ—ఓరీ రేదిమ్మరీడా! తెగనీల్గకుము. వీరు బాలురు కారు; నీవాలిటి కాలురని విశ్వసింపుము.

సుబా—ఓహో! చెఱుగులారా! మెల్లఁగా నూరకున్నకొలఁది యీ మేరమీరి పలుకుచున్నారే! మిమ్మిప్పుడే తీటకట్టిన నాదీర్ఘదంతములసందున నిరికించి కసకస నమలి మ్రింగెదను.

లక్ష్మ—సోదరా! రామభద్రా! ఈ రాత్రించరుఁడిట్లింకను నెంతతడవు ప్రేలుట.

రామ—తమ్ముఁడా! నీవీయజ్ఞశాల రాత్రించరబాధితము కాకుండ రక్షించుచుండుము, నే నీని కాటునిగర్వభంగముచేసి వచ్చెదను. ఓరీ మదోన్మత్త!దుర్బాహూ! సుబాహూ! ఇదిరణయుక్తమైనప్రదేశము కాదు. దూరముగాఁ జని పోరాడుదము రమ్ము.

సుబా—రమ్ము. రమ్ము. ఒక్కముద్దగానమలి తీయఁగా భక్షించెదను.

(రామసుబాహులు నిష్క్రమింతురు.)

లక్ష్మ—(తనలో) ఓహో! కౌశికయజ్ఞమంటపాంతర్భాగమునుండి సామవేదారవం బెంతకర్ణపేయంబుగా వినంబడుచున్నది.

(మారీచుఁడు ఋషివేషముతో ప్రవేశము)

మారీ—(తనలో) భళిరే! ఇప్పుడు నా వేష మెంత యొప్పియున్నది? శ్రీరాముఁడు మహాద్భుతుఁడై నాసోదరుఁడగు సుబాహుని సంహరించిన శోకము దీర్చుకొనుటకు మంచి వెర వూహించితిని. రాముని కంఠస్వరముఁబూని "హా! లక్ష్మణా! రక్షింపుము" నేనిడిన యార్తనాదము తనసోదరునిదనియే విశ్వసించియున్నాఁడు. ఇప్పుడు రాముని సుబాహుఁడే వధించెనని రాముఁ డిచ్చుటకు రాకపూర్వమే వచియుంచెదను అందుచేత భ్రాతృశోకమున లక్ష్మణుఁ డాత్మహత్యఁ గావించుకొనును. అతని గాంచినతరువాత శ్రీరాముఁడును మరణింపఁగలఁడు. ఈవిధముగా నతిసులభోపాయంబున శత్రుసంహారము గాఁగలదు.

లక్ష్మ—ఈవంక కెవ్వఁడో యొకమునిసత్తముఁడు వచ్చుచున్నాఁడు. ఈతనివలన సర్వవృత్తాంతములును దెలియఁగలవు.

మారీ—హా! కుమారా! లక్ష్మణా! రక్షింపుము. రక్షింపుము.

(పాదములపైఁ బడును.)

లక్ష్మ—మునీంద్రా! లెమ్ము. లెమ్ము. నీకేమియాపద మూడినది? పంచభూతములును, సూర్యచంద్రనక్షత్రములును సాక్షులుగా నీలక్ష్మణుండు నిన్ను రక్షించును.

మారీ—ఇంకేమిరక్షించెదవో నాయనా! నీయన్న రామభద్రుని గతి చూచుకొనవోయి తండ్రీ!

లక్ష్మ—ఆ-ఆ, మునీంద్రా! రామభద్రునకేమి? త్రిలోకపరాక్రమశాలియగు రామభద్రునకేమి?

మారీ—అయ్యో! ఇఁకను రామభద్రుఁడెక్కడ?

లక్ష్మ—హా! రామభద్రుఁడే లేఁడా? నాసహోదరుఁడే లేఁడా! నాసహోదరుఁడే లేఁడా! హా! సోదరా! (మూర్ఛిల్లును.)

మారీ—ఈవిచారమే రాఘవవంశచ్ఛేదమునకు కారణముగు గాక, చిరంతరాయముగ లక్ష్మణునకు విచారమే కలుగుగాక!

లక్ష్మ—హా! సోదరా! చతుర్దశభువనైకవీర! దాశరథీ! నన్ను విడచిపోయితివా కన్నీటితో మునివెంటనడవులకు మనలంపినవృద్ధ జనకుఁడు నన్నుఁజూచి నాయనా! అన్న యేడీ? యని యడిగిన నేనేమి చెప్పఁగలను? పౌరులన్నియును రామచంద్రదేయని యాశలు నీపైని నిలుపుకొనియుండ, తల్లియగు కౌసల్య కేమిచెప్పుదును. సోదరా! సోదరా! గంభీరశ్యామల మైన నీమనోహరాకారమును కన్నులకు జూపవేమి? అన్నా! అన్నా! ఎచ్చటనున్నావు? ముష్కరక్రూరదానవులపాల యితివా. సోదరా! నీశరీరము దుష్టజంబూకములపాలు గావలసివచ్చెనా? హా విశ్వామిత్రమహర్షి! వలదువలదని నాయనగారు నెత్తినోరిడి చెప్పు చున్నను వినక రాముఁడు దేవుఁడని యేమియో యనృతములుపలికి మాకొంపదీసితివిగదా! హా! సోదరా!

గీ. రామ! రాఘవ! రఘువీర! రామచంద్ర!
భద్రదశనేత్ర! నుతభానువంశపుత్ర!
దశరథాత్మజ! విబుధసంవనమనోజ!
స్వర్గపురికేగినాఁడవే జాలిలేక.

(మూర్ఛిల్లును)

మారీ—ఇదేసమయము. ఈతని నీదుఃఖమునుండే యుంచిచని యెదగాక.

(నిష్క్రమించును.)

(అనుబంధము 17)

లక్ష్మ—(లేచి) హా! రామచంద్రా! సద్గుణసాంద్ర! ముఖవిజిత సంపూర్ణచంద్ర! మమ్ము విడనాడి క్షణములో దివికేగితివా! చిరజీవి

యయి మహారాక్షసవిరాముఁడగు నీరాముఁ డనిపలికిన కాలాంతకుల పలుకులన్నియు కల్లలయ్యెఁగా! తమవంశంబునిలిపి తమకిన్ని తిలోదకం బులిడునని నమ్మిన తల్లిదండ్రుల కోరికలు రిత్తయయ్యెనా? తమ్ము బాలించి యలరించునని విశ్వసించిన పౌరులతలంపులు గొంతెమ్మకోరి కలయ్యెఁగా? మాతోఁడునీడ మ టుఁగలసెగా? హా! రామా! రామా!

(మూర్ఛపడును)

(రాముఁడుప్రవేశము.)

(అనుబంధము 16)

రామ—అహా! రాక్షసభీతితగ్గ నిరవశేషముగా విశ్వామిత్రుని యజ్ఞము రక్షింపఁబడుటచేత నాకిప్పటికి గదా మనశ్శాంతిగలిగినది. సోదరుఁడగు లక్ష్మణకుమారు నిందే నిలిపి చనియుంటిని. అతనిఁ గలసి కొని మునీంద్రుని సందర్శించెదఁగాక (పరిక్రమించి) ఏమిది? నాతమ్ము డిట్లు మూర్ఛిల్లియున్నవాఁడు! సౌమిత్రీ! ఏమిది? మాటలాడఁడు. ఒక వేళ రాక్షసులెవ్వరైన నితని కీహానిఁ గల్పించియుండరుగదా!

గీ. శశినిగేరెడు వదనంబు జాలిఁదూలె
నాదుపుల్లెలను జెమ్మటఁ దడిసిపోయె
కనులనీరొక కాల్వఁగా గారఁదొడఁగె
నీవిచిత్రంబునకు గత మేమిగలదొ?

ఈతని యలమట నాయ నొకింత శైత్యోపచారముఁ గావించెదను

(విసరుచున్నాఁడు)

లక్ష్మ—(లేచి) హా! రామచంద్రా! రామచంద్రా! మమ్ము విడిచి దివికేగితివా?

రామ—తమ్ముఁడా!లక్ష్మణా! ఇటుచూడుము. నేనే నీసోదరుఁడను రామభద్రుఁడను. అదృష్టవశమున నింకను దివికేగ లేదు.

లక్ష్మ—(తేరిచూచి) హా! ఏమి? నాభాగ్యము! రామచంద్రుఁడు, రామచంద్రుఁడు నారామచంద్రుఁడే నాసోదరుఁడే!

(కౌఁగిలించుకొనును.)

రామ—లక్ష్మణా! కలవరించుట లేదుగదా? కన్నులు తుడుచుకొని తిన్నగా నావంకఁ జూడుము. నేను రాముఁడను. నీవు లక్ష్మణుఁడవు. ఇది విశ్వామిత్రాశ్రమము. నేఁడు నీకీభ్రాంతి యేమి? ఈమూర్ఛ యేమి?

లక్ష్మ—భ్రాంతి కాదుగాని; ముందీప్రశ్నకుత్తరువిమ్ము.

రామ—తమ్ముఁడా! యేమి?

లక్ష్మ—

చ. దశరథగర్భసాగర సుధాకరమూర్తివి రామమూర్తి వే?

రామ—అవును. తమ్ముఁడా నేనే

లక్ష్మ—

యసదృశకాంతిమండిత వియత్సుయకీర్తివి రామమూర్తి వే?

రామ—అవును. తమ్ముఁడా నేనే.

లక్ష్మ—

యసికరదీప్తిభీకరనిరంతరవర్తివి రామమూర్తి వే?

రామ—అవును. తమ్ముఁడా నేనే.

లక్ష్మ—

యతియుతనీలకోమల మహాఘనమూర్తివి రామమూర్తి వే?

రామ—అవును. తమ్ముఁడా నేనే.

లక్ష్మ—అన్నా! మహానందము గలిగెను. పునర్జీవితుఁడనైతిని. కాదు, కాదు, మేమందఱమును పునర్జీవులమైతిమి.

రామ—తమ్ముఁడా! ఏమిసంభవించినది? నేను మరణించితినని నీవూహించుటకుఁ గారణమేమి?

లక్ష్మ—సోదరా? నీవటుచనిన క్షణమునకు హా! సోదరా! లక్ష్మణాయని నీకంఠస్వరమున నొక యార్తవాదము వినఁబడియెను.

రామ—ఏమియద్భుతము! తరువాత ?

లక్ష్మ—తరువాత నొకముని నాకడకువచ్చి రాక్షసులు శ్రీరాముని—అల్పా వానోట వగింపఁజాలను.

రామ—సరే; తమ్ముఁడా! సర్వమును నాకర్థమయినది. సుబాహుఁడు నాచే మరణించ కానియన్న మారీచుఁడు తప్పించుకొనిబయటఁబడెను. ఒకవేళ నిప్పుడు వాఁడైయుండును. కానిమ్ము. వానినిప్పుడే సంహరించెదను (తెరవంకఁజూచి) ఓరోరిదుర్మార్గులారా! మీమాయలు నాకడనఁటరా! తల్లీ! వాయువ్యాస్త్రమా!

గీ. నాదుమరణవార్త నాసోదరునితోడ
దెల్పెఁట్టి నీచునల్పబుద్ధి
నసురునిపుడ సాంగరాంతస్థలంబునఁ
బారవేయుమమ్మ వాయుశరమ!
(బాణప్రయోగముచేయును.)

(తెరలో)

రావణరాజేంద్రా! రక్షింపుము రక్షింపుము.

లక్ష్మ—అన్నా! అది మారీచునికంఠస్వరమే?

రామ—తమ్ముఁడా! ఇప్పటికి దానవసంహారమయి యజ్ఞము సంరక్షింపఁబడినది. తండ్రియానతిందీర్చినవారమైతిమి. అనంతర కార్యవిధానము నెఱుఁగుటకై మునీంద్రుని దర్శింతమా?

లక్ష్మ—అన్నయ్యా! అవశ్యకముగా నట్లుచేయుదము. ఏమందువేని?

సీ. క్రతుదీక్షఁబూనినకతమునఁ దాల్చిన
రమ్యమయపీతాంబరము లెసంగ

మహితదక్షిణపాణి మణికట్టునకు మూఁడు
డాకు కంకణము సొంపై వెలుంగ
రంగైన కుడిచేతి యంగుష్ఠమునకు ప
విత్రమైనట్టి పవిత్రముప్ప
సిద్ధలామానుల యాశీర్వాదముల చేత
దనజడలో, నక్షతలు జెలంగ

గీ. నుదుటిభూతియుకుంకుమానూన రేఖ
కలితహోమాగ్ని చెమటచేఁ గరఁగిపోవ
కేవలము బ్రహ్మమూర్తియా నావదాన్య
కౌశికుసిఁ గాంచ నెద కౌతుకంబు గలిగె.

తెరలో — చిరంజీవులగు రామలక్ష్మణకుమారులను పూజ్యులగు విశ్వామిత్రమునీంద్రులాశ్రమమునకుఁ బిలుచుచున్నారు.

రామ — తమ్ముఁడా! సంకల్పసిద్ధుఁడవు, మహర్షియే మనలఁ బిలువనంపినాఁడు. చూడుము.

ఇద్దఱునిష్క్రమించుదు.

(అనుబంధము 19)

తృతీయాంకము సంపూర్ణము.

(విశ్రాంతిసాంకేతికముగు యవనిక
మెల్లఁగా జారును.)

విశ్రాంతి కాలము.



# సీతాకల్యాణము

## చతుర్థాంకము.

### రంగము 1

(రావణుని సభ-రావ-మంత్రులు, వేగముగ మారీచుఁడు ప్రవేశము.)

మారీ—రావణరాజేంద్రా! రక్షింపుము. రక్షింపుము.

రావ—ఓయీ! మారీచా! లెమ్ము లెమ్ము. నీకేమి యాపద సంభవించినది? పరాక్రమనిధివగు నీవు సయితము ప్రాణభీతిచేఁ బరుగు వారు దుర్గతి యేలగలిగె?

మారీ—రావణరాజేంద్రా! నాదుర్గతి నేమి చెప్పుదును?

రావ—

శా. నీచత్వంబున ప్రాణభీతిఁ గొనిరా; నీ కేమి వాటిల్లె నీ
యాచారంబను రాత్రినాయకులలో నత్యంత హేయంబు నా
లోచింపంబని యేమి ప్రాణభయమేలో నీకు ప్రాప్తించె మా
రీచా! తెల్పుము తీర్తు రాక్షసకులక్షేమంకరోత్సాహినై.

మారీ—మహారాజా! నాతమ్ముఁడు సుబాహుఁడు మరణించి నాఁడు.

రావ—ఏమి! ఏమి! సుబాహుఁడు మరణించెనా? పాపము! మారీచా! కారణమేమి?

మారీ—మహారాజా! విశ్వామిత్రుఁడనుమహర్షి యజ్ఞము చేయుచుండఁగా దేవరయానతిప్రకార మాయజ్ఞమును వినాశము చేయ బోయితిమి. అప్పుడచ్చటకు దశరథుని పుత్రులఁట; రామలక్ష్మణుల ను పదునారేండ్లురానిపిల్లలువచ్చిరి వారిబాహుశౌర్యమెట్టిదో కాని మహారాజా! ఏమిది; రామలక్ష్మణుల పేరులువిని మీరిట్లులికిపడితిరి?

రావ—నీ నానామము లుచ్చరింపఁగనే దుష్కృతనయములతో పాటు నాయొడలెల్ల నొక్కమారుగా జలదరించినది. దానికేమి; కాని మారీచా! పదారేండ్లురాని పిల్లవాండ్రచేతులలోనా; నీసోదరుఁడు సుబాహుఁడు మరణించినది. గొప్పయోధానుయోధుఁడు! అతని నింతకుమున్ను సుబాహుఁడని తలంచితినిగాని యిట్టిదుర్బాహుఁడని తలంపనైతినసుమా!

మారీ—దానవేంద్రా! వారు సామాన్యమానవు లనుకొంటి వేమోవిను.

సీ. నవయౌవనోజ్జ్వలోన్నతశరీరంబులు
రాజవంశోన్నతిఁ బ్రకటపఱుప
కడువిశాలంబులై కర్ణములఁ దాఁకు లో
చనము లదృష్టంబుఁ జాటుచుండ
మలచినరీతిగా, నడుమునిర్వంకలా
నధరయుగ్మంబు పట్టుదలదెలుప
నాజానుదీర్ఘంబులైన బాహువులు, నూ
ర్జితశౌర్యగుణము వచించుచుండ
గీ. సప్తసాగరవలయితభూ చక్రమెల్ల
నేలు భూనాథుఁడని తోఁచు నిఖిలదనుజ

వంశవిఖ్యాతని కతమున పతితమగుచు
టంచుమదిలోన సంశయ మయ్యెనయ్య.

రావ — ఛీ! పిఱికిపందా! ఏమిమాటలాడితివి? సురాసురయక్ష గరుడకిన్నరగంధర్వులందఱును త్రిలోకవిద్రావణుండగు రావణుండని గడగడాయమానసులై శౌమనంబులను మానసంబులమాని దాసానుదాసులై వర్తించుచుండ లోకైకప్రతాపమూర్తినగు నాతేజంబునకు సహస్రమయూఖుండు భీతుండై మేఘంబుల తలదాచుకొనుచుండ, దశదిశాయతకీర్తిబంధురుఁడగు నిదశకంధరుని కంఠంబుల జీవంబులుండఁగా, నొక్కముక్కుపచ్చలారని మానవబాలకుండు దానవకులనాశనం బొనరించునని యసందర్భప్రలాపంబు లాడెద వేమిరా! తులువా!

మారీ — దేవా! ఆగ్రహింపకుఁడు నాభీతికొలఁదియు నట్లు పలికిన తప్పేమున్నిప్పుడు? బాలుఁడు నాతమ్ముని మడియించుటే కాక నాయవాస్త్రబలంబున నన్ను సాగరమధ్యంబునకుఁద్రోసెను.

రావ — ఏమీ! ఆడింభకుఁడు నిన్ను సహితమవమానించెనా? అట్లయిన వాఁడిప్పు డెందుజనియుండును?

మారీ — దేవా! ఆరాముని నాతనితమ్ముఁడగులక్ష్మణుని విశ్వామిత్త్రుఁడు మిథిలానగరంబున నిప్పుడు జఱుగుచున్న సీతాకళ్యాణము నకుఁ గొని చనియుండును.

రావ — ఏమి! మిథిలానగరమున నిప్పుడు సీతాకల్యాణము జఱుగుచున్నదా?

మారీ — అవును. మహారాజా! చిరకాలమునుండియు తనయింట నున్న శంకరుని విల్లునెక్కు పెట్టిన రాకుమారునకు సీతనిచ్చి వివాహము చేతునని తజ్జనకుఁడగు జనకుఁడు చాటఁబంచినాఁడు.

రావ—శత్రుహస్తా! జనకుఁడు మనకు శుభలేఖ నేల వ్రాయింపలేదు?

ప్రహ—మహాప్రభూ! అతఁడిప్పుడు మదోన్మత్తుఁడై యున్నాఁడు. మనల నాజనకుఁడు లెక్క చేయునా?

మారీ—అవును. దేవా! నాకీసంగతి సమగ్రముగా నలసినదే!

రావ—మారీచా! మంత్రిసామంతాగ్రులారా!

ఉ. దానవులార! వైదికవిధానములం దగఁగించఁబోఁడు నే
ననరపాంసను జనకునంతముఁ జేసి తదీయపుత్రికన్
జానకిఁ దెత్తు నాహయిన్యశంసుని రాముని నాతిమ్ముని
బ్రాణముఁ దీసివచ్చెద సహంభయంకరబాణకార్ముకల్.

పరివారము—మహాభాగ్యము. (నమస్కరించును)

రావ—ఆహా! జనకుని సాహసము! కూతుస్వయంవరము చాటించుచు భయంకరభుజాండన నాకు వాళ్ల సంకోడ్చెనుగా! ఏమి వాని ధైర్యము! ఏమి వాని శౌర్యము! నాతోడ విరోధముఁ బూని బ్రతుకఁగలననియే ధైర్యముఁ బూనెనా! ఎంత వెఱ్ఱి! సర్వనాశనమునకే వానికిట్టి దుర్బుద్ధి కలిగెను! ఛీ! వాని నేలయెంచవలెను? ఇట్టిదుష్టరాజుల నటకాలరాయుని; నాదే దేవమాతయును పదునాలుగుభువనంబులును నాకు వశములయియుండ నిమానవులు నాకేపాటివారు?

సీ. దివనాథచంద్రులు దీపముల్ వెలిగింప
 వలనముగా గ్రుచు కలయుంపిజల్ల
వాయుదేవుఁడు కొలువాకిలియూడ్వఁగ
 పాశహస్తుండునై వారమునఁగ
ధనదుండు సరిదైన, దిగ్వెచ్చములఁ జెప్ప
 నవనాగ్ని పాకముల్ సంతరింప,

కద్మసంభూతుఁడు కుచాంగము వదింప
సమరనాయకుఁడు పాదముల బట్ట

గీ. గరుడ గంధర్వ సిద్ధాదికాంతలెల్ల
సనుదినము సభలోన నాట్యంబు సలుప,
భుజబలంబున కనుపాల్గు భువనములను
నేలు నా కివ్వటిఁక భూజాలములను.

నేను ద్వారకేచని యారాజకుని శిక్షించి జానకిం దెచ్చి; యీలంకాపుర మునకు రాణిం జేసెదఁగాక. (అనిపోఁబోవును.)

తెరలో మహతీనాదము)

రావ—ఆ! ఎక్కడి దీ వీణానిస్వనము! ఓహో! త్రిలోకసంచారియగు నారదుఁడు వచ్చుచున్నాఁడు. ఈతనితో నొక గడియ వినోదించి చనియెదఁగాక,

నార—సమయమునకే వచ్చితిని! నే నిప్పటి కిచ్చటికి రాకుంటినా; భ్రమాదము సంభవించి యుండునుగదా! ఈ రావణుని భ్రయత్నంబును మంచి మాటలచే మరల్పవలయును. అందులకు తొలుత కొంచెము స్తోత్రపాఠ మారంభించెదను. (సమీపించి పాడును)

పాట

నార—మహిజనులారా! మనదశకంఠుని మఱువలేకుఁడింక । బహుతరసుఖములు కనమపదంబును బడయును రేవంక ॥మ॥
వారివారు లెందఱు సురపతి తొందఱు ననుదేశుఁడు గలుగ ।
గరిమతులగా, ద్రోహులదలపఁగ, దోషము మదిఁ జెలఁగ ॥మ॥

రావ—భళీ; నారదా. భళిరే; మా సుహామములను, పాటలనుగా కవిత్వము వ్రాసి త్రిలోకములందును చదువుచుంటిరా యేమి?

నార—మహాప్రభూ! మ రేమని తలంచితిరి. నేనా విష్ణువు

నామమును మఱచియే పోయినాను. దివ్యమైన మీనామధేయముండ హారిమొందులకు ? గిరిమొందులకు?

రావ—భళిరా ! నారదా ! భళిరా ! నివొక్కఁడవే మాకు నిజమైన భక్తుఁడవు. ఇదికవిత్వమేనా! లేక నేరిచ్చుటోరచించిరా.

నార—సరిసరి! బ్రహ్మదేవుని కుమారుఁడనై మరొకరు వ్రాసినకవిత్వము నుపయోగింతునా? ఇది నాకవిత్వమే మహాప్రభూ!

రావ—సెబాస్! నీకవిత్వము మా కమితానందముఁగలిగించినది! ఏదీ మరొకమారు పాడుము.

పాట.

నార—తారకమంచును! ద్రిణవముటంచునుఁ దలఁపఁగ మీకేలా! కోరికతో మన రావణమంత్రముఁగొనియుంచరేలా ! తల్లిదండ్రిమన దైవముసేతయుదాతియురావణుఁడే ! నల్లలితంబుగ సర్వసాక్షియగుస్వామియురావణుఁడే !తార!

రావ—ఓహోహో! నారదా! వరహాలకవిత్వము,బంగారుకవిత్వము, మొహరీలకవిత్వము. ఏవుబహుమానముగా నీహారముఁ గైకొనుము. (హారమిచ్చును)

నార—మహాప్రసాదము. నాకీహారము లేటికి స్వామీ! మీ దయయుండవలయును.

రావ—నారదా!నీకేమిలోపము!త్రిలోకసంచారివి, సర్వజ్ఞుని, నేనొకశుభకార్యమున కేగుచుంటిని. వెంటవచ్చెదవా!

నార—ఎక్కడికి మహాప్రభూ?

రావ—అడుగవలయునని యడిగితివిగాక, నారదా! నీకు తెలియనివార్త లేమిగలవు? భూలోకమున జఱుగుచున్న సీతాకల్యాణవార్త వినలేదా?

నార—ఆఁ! నిన్ననే తెలిసినది. కాని, మీరు నయిత మావిల్లె క్కుపెట్టుటకే చనుచుంటిరి కావలయును.

రావ—నారదా! నావంటివాఁడు చనినప్పుడు వింటిలెక్క యేమి?

ఆ. కరుణమాని నృపులగర్వోలుగావించి
జనకుమదమణంచి వసటఁబెంచి
కరము ప్రేమతోడ నిరువదిచేతుల
సీతనిపుడెంబుఁ జేర్చువాఁడ.

నార—రావణరాజేంద్రా! ఇంత వెఱ్ఱివాఁడవయితివేమి! ఇంత యసందర్భముగా మాటలాడుచుంటివేమి? నీవినాశమును నీవే తెచ్చు కొందువా?

రావ—నారదా! నాకు వినాశమేమి?

నార—దానవేంద్రా! నీకు జ్ఞప్తిలేదు కాఁబోలును.

రావ—ఏమి విషయము?

నార—వెనుక నొకమారు నీవు రంభను బలిమింబట్టఁబోయి నప్పుడు నీవు బలిమిని స్త్రీలంబట్టిన నీశిరంబు సహస్రశకలములగునని నలకూబరుఁడు శపించినవిషయము.

(అనుబంధము 20)

రావణా! ఈ ప్రయత్నమును మాత్రము మానుము.

అవునుసుమా! నారదా! నీ కెంతటి పూర్వవార్త జ్ఞప్తికి వచ్చిన ది! ఇది తెలియక నే నేమొనరించిన నేమగునో సుమా.

నార—మహాప్రభూ! నీహితము కోరినవాఁడను తెలుపక తీరునా?

రావ — నారదా! అట్లయిన నిప్పుడేదిమార్గము?

నార — రాజేంద్రా! ఏకీచోరమార్గమేల? బహిరంగముగ నీవును స్వయంవరమునకేగి యావింటినెక్కుపెట్టి సీతాబాలికఁ గైకొనుము. నీకన్న బలశాలిగలఁడా?

రావ — సెబాసు! నారదా! మంచియాలోచనము చెప్పితివి! అట్లయిన నేనిప్పుడే మిథిలానగరమున కేగెదను నా కల్యాణకాలమునకు నీవు రావలయునుసుమా?

నార — అయ్యయ్యో! ఎంతమాటాడితిరి; అవశ్యముగా వచ్చెదను; గాని, రాజేంద్రా! నేను మీ మహానందమున జ్ఞప్తికివత్తునో లేదో?

రావ — సరే సరే; నీవే నాకప్పుడు పురోహితుఁడవు. మఱువకరమ్ము. నాకాలసమయమయ్యెను, పోయివచ్చెద.

(నిష్క్రమించును.)

నార — (తనలో) ఆహాహా రామున్నవరాధన మెఱుంగక చనుచున్నాఁడీ దౌరిమూర్ఖుఁడు.

గీ. హరికిఁ గోరక సిద్ధయై యున్న జనకతనయ
చిక్కునే తలక్రిందైన చెనటులకును
ఊరగాకులు పదివేలు చేసి నేమి
రాజహంసి లభించునే భ్రమయెగాక
నేనింక వైకుంఠమున కరిగెదఁగాక!

(నిష్క్రమించును.)

ప్రేమ—నే నేమియు నెఱుఁగను. దయచేసి చెప్పవా?

సుశీ—నీవు నన్ను వదలునట్లు లేదు చెప్పియే పోయెదను.

ప్రేమ—చెప్పుమమ్మా! మాతల్లిగాదు. నేను కథలనిన చెవులు కోసికొను స్వభావముగలదానను. మాముత్తవతల్లి ప్రాణములున్నయంతము వఱకు కథలు చెప్పుటలో నే గడచిపోయినవి.

సుశీ—గొప్ప కథ జరిగినది. అయితే విను. వెనుక దేవేంద్రునకు-

ప్రేమ—ఓహో! దేవేంద్రుడనన జ్ఞప్తికివచ్చినది. సుశీలా! మాముసలిది బ్రతికియున్నప్పుడు దేవేంద్రుడను మహేంద్రుడని యింద్రుడని చెప్పుచుండునది. అయితే దేవేంద్రుడు మహేంద్రుడు యింద్రుడు ముగ్గురు అన్నదమ్ములే కాదూ?

సుశీ—ఓసీ! నీపాండిత్యము పాడుగాను. నాకథవిడిచి నీకథ నే కరుపెట్టితి వేమి? నీవు నాకైనా చెప్పు నన్ను నీకయినా చెప్పని?

ప్రేమ—చెప్పు చెప్పు సుశీలా! నీవే చెప్పు.

సుశీ—చెప్పు. పాదరక్ష; ఏమి చెప్పను నాముగము.

ప్రేమ—వెనుక దేవేంద్రుడు అంతవఱకు చెప్పినావు. తరువాత నేమిటి?

సుశీ—వెనుక దేవేంద్రుడహల్యాదేవిని మోహించి పరమ పతివ్రతయగు నామెను పొందుటకై యొకకోడియయివచ్చి "కొక్కొరోకో"యని కూయ మొదలిడెను. అదివిని గౌతమమహర్షి యనుష్ఠానసమయమయినదని నదీతీరమున కేగెను.

ప్రేమ—కోడియనగ జ్ఞప్తివచ్చినదమ్మా. వెనుక నొకమారొక కూద్రిపారుగు మాకు సమకూడినదమ్మా; ఆకూద్రిపారుగువలన నింటి నిండ కోళ్ళయినవమ్మా?

సుశీ—సరే సరే; ప్రేమదా! నీకోళ్ళసొదవినుచు కూర్చుం

ష్ణుమూర్తి పాదరజమున స్త్రీ యగునట్లును ననుగ్రహించెను. శ్రీమహా విష్ణువే దశరథునిగర్భమున విష్ణువై జనించెనని వదంతిగానున్నది. శీఘ్రముగా నాయన కనుగ్రహము గలిగి వచ్చుగాక! ప్రమదా! నాకు పని యున్నది పోవలయును.

(పోఁబోవును.)

ప్రమ—సుశీలా! సుశీలా!

సుశీ—మరల నేమే?

ప్రమ—తిరిగి నాకెప్పుడు కనబడెదవు?

సుశీ—రేపీవేళకు.

(పోఁబోవును.)

ప్రమ—సుశీలా! సుశీలా!

సుశీ—చాదస్తురాలా! మరల నేమి?

ప్రమ—నీవు వచ్చునపు డాశ్రమమందలి బంతిపూవులు తెచ్చి పెట్టగలవా? నాకవియనిన నతిప్రీతి.

సుశీ—సరేలే!

(పోఁబోవును.)

ప్రమ—సుశీలా! సుశీలా!

సుశీ—ఛీ! నీతో మాటలాడగూడదు

(నిష్క్రమించును.)

ప్రమ—అయ్యయ్యో! యీరోజులలో మనుచువాళ్లకెంతగర్వము! మాటలాడిన నోటివరాలు రాలునని తలంతురు. పోనిమ్ము. నాకు మాటలాడువారేదొరకరా? సోదెరామక్కయని పేరు పడనే పడినది పాడుకర్మము. నాకు ముచ్చట్లు లేకున్న నల్లమందు తినినట్టు

కానునమ్మా! సరే; పొరుగుననున్న కజ్జాలకొకమ్మతో చిన్నతగవు పెట్టుకొనెదను. ఈదినము గడచిపోవును.

(అనుబంధము. 21)

(నిష్క్రమించును.)

---

రంగము. 3

గౌతమాశ్రమము.

విశ్వామిత్రుఁడు — రామలక్ష్మణులు — ప్రవేశము.

రామ — మునీంద్రా! మిథిలానగర మింకెంతదూరమునం దున్నది?

విశ్వా — బాలకా! క్రమక్రమముగ సమీపించుచున్నారము నడచినంతదూరము లేదు. ఇది గౌతమాశ్రమము. పూజ్యుఁడగు గౌతమమహర్షిని సందర్శించి చనియెదముగాక?

రామ — దేవరవారి యాజ్ఞప్రకారము.

విశ్వా — రామలక్ష్మణులారా! ప్రశాంతమగు నీగౌతమాశ్రమమెంత మనోహరముగానున్నదో వీక్షింపుఁడు.

సీ. శ్రావ్యతమంబైన సామగానంబు ది
గ్వధికర్ణములకు విందొనర్ప
వరమయూరంబులు పురివిచ్చినటియించి
కనులకాహ్లాదంబు గలుగఁజేయ
ముక్కులందున ధాన్యపుంగంకులిడికొని
పక్షిసంతానంబు బార్లుదీర
పల్లవంబులు మేసి చల్లగా నెలమావి
గున్నలకోయిలల్ కూతలిడగ

గీ. పాటులు చెరిపగముగంగోసి వదలినట్టి
మోడులగు నిక్క నంటియు ముంగలెత్తి
సుమహితంబును మోదభాసురముగ
గౌతమాశ్రమ మెదురుగా గానిపించె.

(తెరలో)

పతంజలీ! పుణ్యోదయంబులకు జని, యీ తాలస్వనా? ఆశ్రమమునకు వచ్చిన విశ్వామిత్రమహర్షివి పూజ్యులగు గురుపాదులు వచ్చుదనుక నతిథిసత్కారములచే పూజింపవలసినది. పూజ్యురాలగు భగవతి యమునాదేవి యానతిచ్చుచున్నది.

విశ్వా—రామభద్రా! మునికుమారులు మనలసత్కరింపుచున్నారు. గౌతమమహర్షి యాశ్రమమును లేసినాస్త్రయు స్పష్టమయ్యెను గదా. కావున పూజ్యుండగు గౌతముని రాకగు మనపర్యంత మిందే యుందు విష్టుల మగుదము.

లక్ష్మ—మునీంద్రా! ఇందొక విశాలమగు శిలాపత్రదశము గలదు. అంతదనుక నిచ్చట కూర్చుందము.

రామ—మునీంద్రా! ఈశిల రమణీయముగనున్నదిసుమీ. ఇంతేకాక, సశిలాపరిసరము పుష్పపత్రరాజితమై యున్నది. ఇది యొకవేళ పూజార్హప్రదేశమేమో! యిందు మనము వాసినులము గాదగునో లేదో.

విశ్వా—రామభద్రా!

గీ. గ్రామ్యులగువారు కటుశిలాఖండములను
దారుశకలంబులను దేవతలుగ నెంచి
పుష్పఫలపత్రములచేత పూజచేతు
రిదియునట్టిదెనువమ్మ మహీశతనయ.

ఈమావతి గౌతముని సతియగు నహల్య. వీరిరువురును విగతశాప యగు నీమెకు నమస్కృతు లొనర్పుఁడు.

రామ— } భగవతియగు నహల్యకు
లక్ష్మ— } సాష్టాంగప్రణామములు.

అహ—కల్యాణమస్తు.

విశ్వా—సెబాస్! రామభద్రా! దేవి యహల్యయుక్తముగా దీవించినది మనమిప్పుడు సీతాకల్యాణార్థము చనుచున్న మిథిలానగర ప్రయాణమున కీదినము మెంతయుఁ దగియున్నది. మనమీ రేయి యీగౌతమాశ్రమము నుండి రేపకడనే మిథిలానగరమునకు ప్రయాణ మొనరింతము.

రామ—లక్ష్మ—దేవర యానతి.

అహ—మహాత్ములారా! యిటు, యిటు.

(అందఱు నిష్క్రమించుచును.)

## రంగము 4

### గౌతమాశ్రమము

ప్రమద—సుశీల—ప్రవేశము

ప్రమ—సుశీలా! సుశీలా!

సుశీ—ఓహో ప్రమదా! వచ్చితివా!

ప్రమ—వేళకే వచ్చితివిగా. నాబంతిపూవులు మాత్రము తెచ్చినావు కాఁ.

సుశీ—నీబంతిపూవులు బండలుగాను. వడ్లవారి పేరమ్మవలె కొప్పులో తురుముకొనుటకా యేమి? సుశీలా! ఎవరియందము వారిది. ఎవరి యిష్టము వారిది. కొందఱికి నీరుల్లి యిష్టము. కొందఱికి వెల్లుల్లి యి

ష్టము, కొందఱికి కావపెట్టి చేసినకూర యిష్టము. కొందఱికి పప్పుపెట్టి చేసినకూరయిష్టము. కొందఱికి చెంగావిచీర యిష్టము. కొందఱికి నల్లచుక్కలఅద్దకపు చీర యిష్టము.

సుశీల—అదిగో! వల్లకాటి పోదే మొదలుపెట్టినావు.

శ్రీమ—పోదె కాదమ్మా! నాబంతి పూవులమాట తిరిగితలపెట్టినావు కాబట్టి దా. మాయూరిలో పొద్దు గూకునరికి పదిమంది ముత్తయిదువకుచాలము నాటిలో పచ్చగా నిండార బూసిన బంతిపూవులను కొప్పులలో బెట్టుకొని, చాకలివాని తెచ్చిన చలవమడతలు గట్టుకొని లేతవెన్నెలలో నానుసలిది చెప్పు కథలు చెప్పుకొనుచు కట్లకట్లకవవ దీసికొని మెట్లబావికి నీళ్లకు వెళ్లువారము. మాయూరిముములో బంతిపూవులను చూచినదిమొదలు, నాకామాట జ్ఞప్తికి వచ్చి బంతిపూవులు బంతిపూవులని కలవరించుచున్నాను. లేకున్న నీ బంతిపూవులెవ్వరికి గావలెను, నివెవరికిగావలెను. క్రొత్తమగడుదొరికినాడని మాటలాడుటకే నీకలక్ష్యమయినదే తల్లీ!

సుశీ—అయ్యో! దాసస్తురాలా! నీకు కోపమెందులకమ్మా!

శ్రీమ—కోపముకాదమ్మా! ఇష్టమైన వస్తువు దొరకనప్పుడు-

సుశీ—ఈదిన మొకటిక పట్టు. శ్రీమదా! రేపు నీకు కావలసినన్ని బంతిపూవులు తెచ్చి యిచ్చెదను.

శ్రీమ—నిన్న నాతో నేమంవార్తము చెప్పితివో, ఆచలవన శ్రీరామచంద్రుడు వచ్చుటయు మాయమ్మ లభించుటయు సంభవించినది. ఆసంతోషమున నన్ను మఱచితివి.

సుశీ—శ్రీమదా! నిన్ను మఱువలేదు. అహల్యాశాపవిమోచనమైనందువలనను శ్రీరామలక్ష్మణులతో పూజ్యుడగు నవరబ్రహ్మము యీశ్రీమమునకు వచ్చుటవలనను దేవతాపూజలనంతములుగా

స్పద్ధది కాదా, తత్పరిహారము నొనర్పఁగలేకయుంట నీ
సాధ్వి కెందరిలోకమున జొచ్చె మహోజ్జ్వలదావవహ్నిగన్.

బుద్ధి — దేవా! జనకరాజేంద్రా! బిడ్డలను గన్నతండ్రికి యీపాటి విచారముండు లోకవింత కాదు. బిడ్డలే లేనివా రెంత మందభాగ్యులు.

జనక — సచివశేఖరా! ఇంతకన్న బిడ్డలు లేనివారే ధన్యాత్ములని నాయభిప్రాయము. ఏమనిన;

ఉ. సంతతిగల్గ లేదనుచు స్వాంతమునందుఁ జింత కల్గినన్
కాంత యొపుత్రుఁడో యనుచు గల్గెనుచింత; కుమారుఁడైనచో
హంతకుఁడౌనటంచు మనమందునఁ జింత; కుమారియైన నా
కాంతకు పెండ్లియైనదనుకం గనుచింత; నిరంతచింతగా.

బుద్ధి — దేవా! పిల్లలు లేనియిల్లు శ్మశానసన్నిభమని పెద్దలు వచింతు వినమే! సీతాదేవికి తగినవరుఁడు లభింపఁడేమోయని తమరింతగా చింతింపఁ జనదు. కళ్యాణకాలము భగవన్నిర్ణీతమైనది. అది వచ్చుదనుక నెందఱెన్ని ప్రయత్నము లొనరించిననే లాభమును లేదు.

జన — బుద్ధిసాగరా! అట్టిశుభకాల మెప్పటికోకదా! మానవమాత్రమగు స్వయంవరము చాటించినందుల కిప్పుడు మరిమరివిచారింపవలసి వచ్చుచున్నది. అనేకరాజసమూహంబు లాహరునివిల్లును సజ్యముగాఁ జేయనేరక యవమానితులై తిరిగిచనిరి. నామనోభీప్సిత మీడేరదయ్యెను.

(తెరలో)

మహారాజా! రక్షింపుము. రక్షింపుము.

జన — (భీతితో) ఏమిది! కళ్యాణగృహంబున నీయార్తనాద మెవ్వరిది ?

(తెరలో)

దేవా! జనకరాజేంద్రా! దురాత్ముఁడయిన రావణాసురుఁడు పుష్పకారూఢుఁడై యాగ్రహముతో మనపురముం బ్రవేశించి జనకరాజేంద్రుఁ డెక్కడని కేకలువేయుచు సభాభవనము బ్రవేశించుచున్నాఁడు.

జన—మంత్రిసత్తమా! ఇప్పుడేది యుపాయము? ఆదురాసంధుఁడీ సభాభవనముం బ్రవేశించిన పిదప మనకెట్టి కీడు మూడనున్నదో కదా?

బుద్ధి—దేవా! రాత్రించరుఁడగు నాపాపాత్ముఁడు చనువరకు నణఁగియుండుటయే యుత్తమము. వాఁడును స్వయంవరార్థమై చనుదెంచెనని తోఁచుచున్నది.

జన—బుద్ధిసాగరా! నేఁడెట్టి మహోపద్రవము తటస్థించునోయని నాగుండెలు దడదడ గొట్టుకొనుచున్నవి.

బుద్ధి—మహారాజా! ధైర్యము తెచ్చుకొనవలయును.

(తెరలో)

ఓహో! జనకరాజేంద్రపరివారవర్గములారా! బిగ్గరగాఁ జెప్పుచున్నాను. వినుఁడు.

చ. అనుపమగర్వభావమున నాత్మజసంవరణప్రశంసకున్
బనిగొని సర్వభూపులకు వార్తలు బంపి పరాక్రమాంచితున్
దనువిడనాడి భంగపడునట్లొనరించినయాతఁ డేఁడి ? యీ
జనకనరాధినాయకుఁడు సత్వర మాతనిఁ గాంచవచ్చితిన్.

జన—(విని) ఆహా! మహాపరాధము సిద్ధమైనది కదా! బుద్ధిసాగరా! ఇప్పుడు కర్తవ్యమేమి?

బుద్ధి—మహారాజా! ధైర్యము వహింపుఁడు. కర్తవ్యము నప్పటికేదో భగవంతుఁడు సూచింపకపోఁడు.

(రావణుఁడు ప్రవేశము.)

రావ—చ. అనుపమగర్వభావమున (అనుపద్యమును పఠించుచున్నాఁడు)

జన—మంత్రిసత్తమా! ఆపాపాత్ముఁ డీ సభాశాలకు వచ్చియున్నాఁడు. ఇప్పుడు నేను కింకర్తవ్యతామూఢుఁడనై యున్నాఁడను. అతనికీయఁదగిన ప్రత్యుత్తరమిమ్ము.

బుద్ధి—(ఎదురేగి) రాక్షసలోకసార్వభౌమా! తమదానుండగు జనకరాజేంద్రుఁ డిచ్చటనున్నాఁడు.

రావ—(పరిహాసముగా) ఓహో! వీరెవ్వరు? జనకరాజేంద్రులా! మాకంతటి గౌరవమేల? (దగ్గరకు వచ్చి) ఓరి పాపీ! జనకభూపాలా!

ఉ. ఈయనమాటలేల? మతిహీన! నుదంబు వహించినావొ, గం
జాయిని బీల్చినాఁడవొ? భుజాబలయుక్తుఁడవైతొ? లేక సా
రాయిని ద్రావి మత్తుగొని రావణు నన్ను నిరాకరించితో
యీయపరాధదోషము క్షమింపఁగ దగ్గది గాదు జాల్ముఁడా!

మంత్రి—దేవా! క్షమింపవలయును.

రావ—ఓరీ జనకచండాలా! చతుర్దశభువనైకవిక్రముండ నగు నే నాహరధనువు నెక్కిడ లేనని తలంచుచూ నాకు వార్తనంపవైతివి— కాక నన్ను నిరాకరించితివా? ఆధనువు నెక్కిడుటకు నాకన్న సమర్థులు నీకు దొరకుదురంటరా! నావంటిదానవలోకచక్రవర్తి నీకల్లుఁడుగా లభించుపుణ్యమునయితము గలదా ?

మంత్రి—హరిహరీ! పాపము శమించునుగాక,

జన—(తనలో) దనుజేశ్వరా! సకలభువనేశ్వరుఁడవగు నీకు

వార్తనంతయుంచుమా! మంత్రియగు బుద్ధిసాగరుండానాఁడే నీకు లేఖ నంపెను. నీవింకను స్వయంవరమునకు రామిందలంచి విస్మయమందుచు ప్రతిక్షణమును నిరీక్షించుచున్నాము.

మంత్రి—దైవమా! సత్యము నాచే ప్రమాదిపది.

రావ—ఏమి! నాకు వార్త పంపితివా? ఏమి! నాకడకైన నది రాలేదే ?

బుద్ధి—మహాప్రభూ! అది నా దోషము కాని రాజేంద్రునిది కాదు. సామాన్యులగు రాజపుంగవులకు వ్రాసినవిధముగాఁ దమకు శుభలేఖ వ్రాయ సాహసింపఁజాలక ననేక సహస్ర పత్రంబులపైన తమగుణవిశేషసహితమగు శుభలేఖలను లిఖించి లంకాపురమునకు మార్గము నెఱుంగక దానిని సాగరంబున వైచితిని. చేరినదో లేదో నే నెఱుంగను.

రావ—సెబాస్! జనకరాజేంద్ర! కడుబుద్ధిశాలియగు సచివుని సంపాదించితివి! చేసిన నేరము నిట్లుగదా కప్పిపుచ్చుకొనవలయును! దానికేమిగాని నీతనయ నిట్లోకమారు కొనిరమ్ము మేము చూచెదము!

జన—(తనలో) దైవమా! ఈ పాపాత్ముఁడు సుకుమారియగు జానకి నింకు తెమ్మనుచున్నాఁడే. ఏది తెరవు

బుద్ధి—రావణరాజేంద్రా! శంకరయేమి? హరధనుస్సును గాంచిన పిదపనే యాహారిమధ్యం గాంచనగును.

రావ—ఓహో! సత్యము నీహరధనుస్సెకటి సరోధవా! మూఁడులోకంబులను గడగడ లాడించు వీరాధివీరుఁడను. నేనా విల్లు నెక్కుడఁజాలనని, తలంచితిరా యేమి?

జన—(తనలో) దైవమా! నిజముగా నితఁడా దాని నెక్కుడునా యేమి?

బుద్ధి—రావణరాజేంద్రా! తమ పరాక్రమము సకల భువనంబులకును విదితమే; మేమట్లు తలంచుట కవకాశమేమియున్నది? అయినను, స్వయంవరదీక్ష యది యేకదా! అరవంత కార్యముం దీరినపిదప తమరు స్వేచ్ఛగా సీతాకళ్యాణ మాచరింపవచ్చును.

రావ—బుద్ధిసాగరా! అట్లే కానిమ్ము.

బుద్ధి—దేవా! ఇయ్యదియే హరధనుస్సు.

రావ—ఇప్పీ, ఈపాటిధనుస్సునకే యింతటి యార్భాటమా! దీనినిఁగాంచియే రాజాధిరాజులు నిష్ప్రయోజకులైరా?

(విల్లునెత్తఁబోయి క్రిందపడుచున్నాఁడు.)

(నారదుఁడు ప్రవేశము)

నార—రావణరాజేంద్రా! రావణరాజేంద్రా!

రావ—(విల్లు పైనబడగా తప్పించుకొని లేచుచున్నాఁడు)

నార—రావణరాజేంద్రా! శీఘ్రము లెమ్ము. ఇది నీకు కళ్యాణసమయము గదా. పురోహితుఁడనై నేనే వచ్చితిని. ఆనందసమయము గావున మఱచిపోవుదువని మున్నే చెప్పియుంటిని అవును. ఆనందమున మఱచితివి. కావున నే మాటలాడకుంటివి.

జన—(అప) బుద్ధిసాగరా! ఈనారదుఁడు రావణునకు లజ్జను గలిగించుచున్నాఁడు.

బుద్ధి—మహారాజా! మాటాడవేమి. పెండ్లికూఁతురు రాకమున్నే. లజ్జించెదవేమి! అనుదానవా! జనకరాజేంద్రా! నీయల్లునకు స్నానము చేయవేమి. (వెనుక తెరవ్రాలును)

(బుద్ధి—నార—రావ—ముందునకు వత్తురు.)

రావ—నీవిందేల వచ్చితివి?

నార—ఏలనా! మహాప్రభూ! ఇప్పుడట్లుండదా మరి' కల్యాణ సమయమునకు రమ్మని: నన్ను ట్లనమానించదగునా?

బుద్ధి—నారద మునీంద్రా! రావణరాజేంద్రులేలనో విల్లు నెత్తలేక భూమిపైఁ బడియెను

నార—ఓహో అటులనా! బుద్ధిసాగరా! ఈతఁడు విల్లు నెత్తలేక పడెనా? రావణా! ఇదేమోయి! గొప్పశూరుఁడ వనుకొంటిని. కాటికాయలవంటి పదితలలు, పొట్లకాయలవంటి యిరువది చేతులతో నేలపైఁ బడితివా? అబ్బా. నాకన్న శూరుఁడెవ్వఁడని, ప్రగల్భములు పలికితివే! ఛీ ఛీ: ఇంతనిచమైతివా.

రావ—నారదా! నీచమగుదునా? బలాబలప్రయోగమునకు సమయాసమయములుగలవు. నేఁ డదేమో, నాశరీరము తిన్నగా లేదు, జయులుదేరినప్పుడపకకుసము లైనవి సుమా!

నార.—రావణా! ఇందులకు విచారింపకుము. ఏమంటివా?

ఉ. ఈయవమానమీప్పు మరియొక్కటికైనఁదీర్పవచ్చు నేఁ
డీయవమానమంబు నిట నెవ్వరుగాంచఁగ లేరు; కాంచినన్
వాయిడినిన్ను నేదయినబల్కఁగ నోడును గాదె లోకముల్
ధీయుతుఁడైతి వేనియు, మదిఁగొదలన్వడ కేగుమింటికిన్.

రావ—అట్లే పోవుదము. నారదా! రమ్ము.

(నిష్క్రమింతురు.)

చతుర్థాంకము సంపూర్ణము.





# సీతాకళ్యాణము

## పంచమాంకము

### జనకుని సభాభవనము

జన — మంత్రీ! బుద్ధిసాగరా! ఆనాఁడు రావణుఁడు పరాభవింపఁబడి చనినది మొదలు మనగేహమున కెవ్వరును సాహసించి సీతాకళ్యాణమహోత్సవమునకై వచ్చుటయే లేదు. నాహృదయమున నీచింత నానాఁటి కధికమగుచున్నది! చూఁడు.

సీ. ఆనందమందుదునా నాదుసుతసీత
  పూనినదీక్ష కవసానమున
సంతోషపడుదునా సకలరాజన్యులీ
  పీటనొందిన భంగపాటుదలఁచి
వగతునా యేండ్లుపైఁబడిన కూఁతురు పెండ్లి
  గాలేదటన్న లోకంపునడికి
మానుదునా యొకమారుపూనిన ప్రతి
  జ్ఞను వరహీనకారణముచేత

గీ. ఆత్మజాపరిణయకార్యమందుతుదకు
  బుద్ధిసాగర దుఃఖవిస్ఫూర్తిమిగిలె

నేమి చేయుదునీ తుదకు నాకేది దారి?
కలతపడెనయ్య హృదయసౌఖ్యంబు వోయె.

బుద్ధి—దేవా! శుభకార్యములు నిదానముగా జరుగుచుండవలెనే గాని తొందరపడకూడదు.

జ:—ఇంతటి విశ్వామిత్రకార్యంబున కొడిగట్టి నేడు నాటి వారిలో నెట్లు మెలఁగఁ గలను.

(తెరలో) మహారాజా! పరాక్.

జ:—ఏమిరా యది?

(తెరలో)

దేవా! పూజ్యుఁడగు విశ్వామిత్రమహర్షి యనుయాయిభాగ్యులగు నిరువురు రాకుమారులతో వచ్చి ద్వారమున వేచియున్నారు

జ:—పూజ్యులగు వారిని శీఘ్రముగాఁ బ్రవేశపెట్టుము.

(తెరలో) భాగ్యము

బుద్ధి—దేవా! ఇంతకుముందే మీరు విశ్వామిత్రకార్యంబాచరించితినని పలికియున్నారు. ఇప్పుడు విశ్వామిత్రమహర్షియే ప్రవేశించినాఁడు.

జన—మంత్రీ! నీవు నిజము గ్రహింపలేవు. విశ్వామిత్రాగమన వార్తకన్న నాకు రాజకుమారాగమనవార్తయధిక ఆనందప్రదమయ్యెను. ఏమంటివేని,

గీ. తనయ బెండ్లియాడఁ దగిన రాజసుతుండు
వచ్చునెపుడటంచుఁ బవలు రేలు
స్మరణ జేయుచుంటి శ్రవణరంధ్రముల నా
పలుకువోక తనువు పులకరించె.

బుద్ధి— పరమేశ్వరుఁడు నేఁడు మీ చిరకాలవిచారంబుఁ హరించునుగాక.

(విశ్వా-రామ-లక్ష్మ-ప్రవేశము.)

విశ్వా— రామలక్ష్మణులారా! అతఁడే రాజచంద్రుఁడగు జనకచక్రవర్తి. అల్లదియే యాగసాలనుంపఁబడినది హరధనుస్సు. మీరిద్దఱును నావెనువెంటనుండుఁడు.

రామ— }
లక్ష్మ— } దేవరయాజ్ఞ

జన— (ఎదురేతెంచి) పూజ్యుఁడవగు విశ్వామిత్రమునిచంద్రమా! విధేయుఁడు జనకనాముఁడు సభక్తిపూర్వకముగా నమస్కరించుచున్నాఁడు. చిరంజీవులారా! మునీంద్రులతోఁ బాటు మీ రాసనంబులం గైకొనుఁడు.

విశ్వా— నరేంద్రసత్తమా! నీకు శుభంబగుఁగాక. రామసౌమిత్రులారా! మీరీయాసనములఁ గూర్చుండుఁడు. జనకరాజా! నీవును సావధానుండవు గమ్ము.

జన— భాగ్యము. (కూర్చుండును)

మునితిలకా! నీదర్శనంబునఁ జరితార్థుఁడనైతిని! ప్రత్యక్షరతీరమణులవలె వెలుఁగొందు నీబాలవీరులెవ్వరు?

విశ్వా— రాజా! నీప్రశ్నతోడ నిమిత్తములేకయే నేను వీరిని నీకెఱింగింపనుంటిని. చల్లకువచ్చి ముంతదాఁపనేల? వినుము.

గీ. కౌసలేశుని దశరథుకూర్మిసుతులు
ఖలులఁ గూల్చి నాయజ్ఞంబుఁ గాచినారు
వీరు రామలక్ష్మణసంజ్ఞ వెలయువారు
భవహరునివిల్లుఁ గనుఁగొనవచ్చినారు.

జన—(ఆనందముతో) మునీంద్రా! దుర్భరంబగుహరచాపఖండనప్రతిం బాటంకమయ్యెను గాక, గాధిజా వీరిలోనొక్కరాకుమారునకు నాతనయను సాలంకృతముగ దానంబుసేయకుందునా?

విశ్వా—ఆ సిమ్మ. ఆయాటంకము నాచేతనేల తీరకుండవలయును! వీరిలో నెవ్వరికిం గానిమ్ము యీచాపకంబు భారముగాదు.

జన—బుద్ధిసాగరా! మనజానకిని సఖీసంయుతముగా పుష్పమాలాయుక్తముగా రావింపుము. వేగముగ పురోహితబంధుమంత్రిసచివుల వివాహమహోత్సవంబునకు రమ్మనుము. మంగళవాద్యములను సిద్ధముగానుంపుము. అంత పుష్పమాలికలతోడను శుభకుంకుమలాజాక్షతలతోడను సుమంగలులను గాచియుండుమని చెప్పుము.

బుద్ధి—భాగ్యము (పోయియథోక్తముగా ప్రవేశించును)

విశ్వా—రామా! హరధనుస్సు నెక్కుపెట్ట కాలస్యమేల?

లక్ష్మ—తమయాజ్ఞయే యవశిష్టము.

విశ్వా—అది తీరినదిగదా.

(అనుబంధము 24)

రామ—విశ్వామిత్రునకు ప్రదక్షిణముచేసి ధనుస్సు నెక్కిడగా విరిగిపోవుచున్నది.

(అనుబంధము 25)

(సీతారాములు పుష్పహారములు వేసికొందురు. వాద్యములు మ్రోగును. పుష్పవర్షము కురియును. ఆశీర్వదించుచుందురు.)

పంచమాంకము సంపూర్ణము.

# సీతాకల్యాణములోని పాటలు.

---

### 1 బారువా ఆదితాళం

విశ్వా—రాజేంద్రియజనమున్। నేఁటుపుణేనాటికో॥ రా॥

ఖలాత్ములగు గాతుసాధములనా సవనమెల్ల నారంబునల్పిరో॥ రాజేంద్రా॥

ఖలమాతులసురుల గెలువమునుల విలసితతపములుపొడవడఁగెఁ పుణ్యపురుషాగ్రగణ్యులుగ మువిడచిరి॥ రాజేంద్రా॥

### 2 బారువా—ఆదితాళం

దశ—రథ లమికి నేఁచక నేలగుణభరిత కులలగునసుగుల గానిమొదగా॥ దాల॥

వధమునకు జేరిన ధారుణిదూరిన మహీపతిపురమున బారిన విరోధగిణాంబుగెడపెద॥ దాల॥

మునులనుశాంతుల నల్పెద నమునమ తపములుధరించిని నిల్పెద తపోగుణసాంద్రిదేలుపునవ॥ దాల॥

### 3 బ్యాగ్ - ఆదితాళం.

విశ్వా—ధరణీశారాఘవ సుగుణాభిరాముఁ వనికింపుమా॥

అతఁడుకలదైత్యపాళిఁ బ్రాంగసురవైరిజాలిఁ వధియించుగా దహించుమగా। ధర॥

శౌర్యుఁగనుచునెంచనేలా బహుబలుండతడుచాలా తలపోయుమా ధృతిబూనుమా। ధర॥

15 నాయిక — జంపెతాళం

శా|| వి — శుభమస్తువిజయోస్తుసతతము సభయమస్తు। శు॥
రఘువంశసుకుమార రాజేంద్రసుతులార।।శు ॥

ఖలదానవార్భాటము లకు మదిచలనమాన వహియింక కేజయ
ము వడయుడనుకనుగను। శుభ॥

16 లక్ష్మణుడు — జల్తలమేతూ ఈశ్వై॥)

అనుజనిరాగకే చేసినా। మునివరు కలుకేవినినా। హా। దైవ
రాయా। కృపాధేయ ॥ అను ॥

జననాధు జనకునాజ్ఞ। వనముజేరి దుష్టకీర్తి — లై ॥ అ ॥
(సాకీ) హా ఒకవంక సోదరపాతిని రక్షణంబూ। వేరొకవంక
మునీంద్రయాజ్ఞ రక్షణంబూ। ఇరువంకల నూయియు గోయియువలె
నిల్వగా। ననేదిగాపించి సేదిమానునునో హా। కష్టహరణ। కమల
చరణ। సుగుణాభరణ। దే — వా ॥ అను ॥

17 లక్ష్మణుడు — (బాయీజారతో నే)

హాహా। రఘువరా। న్నువిడిచితినా ॥ హా ॥
అనుజా। విజ । భూమిజ తేజా। పుణ్యశీల। భూపాలా ॥ హా॥
దానవతతులం। దరిసిద్ధింకర్। దారుణముగ ని। తపోవనిన్।
క్రూరరాక్షస। మాయలలో నీ। పాతినుబాయన్ పాప్తిన్। గని
నా వేహా ॥ హాహా ॥

18 — సారంగ — ఆదితాళం

రాము — ఆహా సురహితమయ్యో దనుజులుచావగ ॥ ఆ ॥
నిఖల జనులకును। నిత్యములు తొలగెను ॥ఆహా ॥

క్రూరాత్ములనేకులు లోకమునన్। కుటిలతి గమనాశన మొన
రింపన్। శూరంబాణజాలముల శుభముచేర। క్రూరులన్। చోరులన్

సర్వలోకధా అఅ అఅ ర ॥ శర ॥

నీరజ భవభవ సురనుతచరణా । శుభచరిత । రిపుహత ।హత దురితా । సుగుణభరిత । నిగమపోషణా యుష్టేదన్ ॥ శర ॥

23—బ్యాగ్—ఆదితాళం

ప్రిమద—మేలుమేలు నికను చాలు పి్రియముగ నీనతినదమ లక్ష్మి హాము దెలసెను ॥ మేలు ॥

నోరుదెరువ వరహాలురాలువ । అమిత గర్వమానసంబుతో నీ। యతివసంచరించెదున్ గదా నే। నెంతదాన నెరుగలేక నిటుదావలి కెగా । బాగుగా । నిరంతరము ॥ మేలు ॥

24 సోహిని—కురుజంపెతాళం

రాము—ప్రిణతోస్మి । భవవినుత ప్రిణతోస్మి । మునిచంద్ర ॥ ప్రిణ ॥

భవదీయ చరణాబ్జ । కమలనుల కనవరత ॥ ప్రి॥

జనకనర । వరసభను । హరధనువు దునుముగను । భుజబలము నొసగుటకు । వరకరుణ బరపుమిదె ॥ ప్రిణతోస్మి ॥

25 ఆనందభైరవి-అటతాళం

అందరు—జానకీ! తల్లీ! జానకీ! మాసీతమ్మా॥ జా॥

చిన్నగాన త్తింటికేగికన్నదానినిమరువకమ్మా మన్ననలపొడగాంచుమమ్మా మగనితో కాపురము జేసి। జాన॥

అత్తమామలసేవజేయుచు నందరకుతలలోనివాలుక వగుచు వెలగు సుగుణభూషణ సాధుపోషణమంజుభాషణ। జాన॥

మరదులనుసోదరులరీతిని పరిజనులపుత్రికులరీతిని కరుణనీతో టికోదండ్రినునహాదరులటుచూనుమమ్మా॥ జాన॥

తల్లిగోయరపేదదానవు తాళజాలవుగాలికైనను మల్లెమొగ్గల బరువునైనవు మగనితోనెటు మసలుకొనెదో। జాన।

---

ఆంధ్రనాటకములు. క్రొత్తగా అచ్చుపడినవి.

భక్తరామదాసు 1—0—0

గ్రంథకర్త, కేతవరపు శివరామశాస్త్రిగారు

అర్జునప్రతిజ్ఞ 0—12—0

గ్రంథకర్త, వ్రిశాప వెంకటేశ్వర్లుగారు.

కృష్ణలీల 1—0—0

గ్రంథకర్త, సంపన్మకుంబ శింగరాచార్యులుగారు.

లంకాదహనము 0—10—0

గ్రంథకర్త, కోగింరాజు సీతారామరావుగారు.

కనక్తారా 1—4—0

గ్రంథకర్త, చందాల కేశవదాసుగారు.

తులసీదేవి 1—0—0

గ్రంథకర్త, ముత్తినేని వెంకట చెన్నకేశవులుగారు

సంగీత ప్రహ్లాద 0—12—0

గ్రంథకర్త, సోమరాజు రామానుజరావుగారు.

రామరావణయుద్ధము 0—12—0

గ్రంథకర్త, సోమరాజు రామానుజరావుగారు.

జనరల్ బుక్కుడిపో.
బెజవాడ, కృష్ణాజిల్లా.

## — వైద్యగ్రంథములు —

నాడీనక్షత్రమాల 0-4
నాడీపరిజ్ఞానము 0-6
సుఖవ్యాధిచికిత్సాచంద్రిక 0-12

## — హరికథలు —

ఆ॥నా॥మార్కండేయచరిత్ర 0-12
హరిశ్చంద్రోపాఖ్యానం 0 12
రుక్మిణీకల్యాణము 0-12
జానకీశపథము 1-0
అంబరీషోపాఖ్యానం 0-8
భీష్మచరిత్ర 0-8
గజేంద్రమోక్షం 0-8
సూర్యనారాయణశతకం 0.4
సారంగధరనాటకం 1-0
ప్రియంవదాచరిత్ర బి॥ బా॥ 0-6
హరిశ్చంద్రోపాఖ్యానం , 0-6
సీతాకల్యాణము 0 8
శ్రీకృష్ణరాయబారం 0 10
కబీరుదాసుచరిత్ర బా నా 1.0
శ్రీరామజననం తో॥ వెం 0-8
జానకీపరిణయం డిటో 0-8
అహల్యాశాపవిమోచనం 0-8
మణిమాల కే॥ నా॥ 0.12
తారాచంద్రీయం తా॥ పీ॥ 0-12
రసపుత్రవిజయం ఇ॥ యు॥ 1-0
రాణాప్రతాపసింగ్ డిటో 0 12

## —ఆంధ్రనాటకములు—

శారదావిజయం కొ॥ న 0-12
సామ్రాజ్యోదయం దో॥ సీ॥ 0-10
ముక్తావళి శ్రీ॥ భ॥ 0-12
మాళవిక ము॥ చ॥ 0.12
సత్యాబాయి జ॥ ల॥ 0-12
భీమప్రతిజ్ఞ క॥ కొ॥ 0.12
కబీర్ దాసీ కుసుము శ॥ రా॥ 0-12
సారంగధర వి॥ సు॥ 0-12
కుశలవ డిటో 0 12
శ్రీనివాసకల్యాణము దో॥ సీ 0-8
ప్రతిజ్ఞాయాదవము అ॥ సు॥ 0-12
విచిత్రచిత్రమాల అ॥ సో॥ 0-12
నవరత్న చింతామణి డిటో 1-0
సంపూర్ణోత్తరరామాయణం 1.4
చతురచంద్రహాస దో॥ సీ॥ 0-8
తులసీదాస్ కొ॥ న॥ 1-0
భక్తకబీర్ డిటో 1-0
లంకాదహనము క॥ యు॥ 1-0
రామరావణసంగ్రామం 1-0
సురాజుద్దౌలా జ॥ ల॥ 0 8
ప్రభాకర డిటో 0-8
సారంగధర ఆ॥ నా॥ 1 0
జయంతిజయపాలం దో॥ సీ॥ 0-8
మైరావణవధ కొ॥ హ॥ 0-12
తారాబాయి 0 12

వలయువారు :—జనరల్ బుక్కుడిపో,
బెజవాడ, కృష్ణజిల్లా.

| | |
|---|---|
| సుగ్రీవ పట్టాభిషేకం | 0-12 |
| శ్రీరామనిర్యాణము బో॥ శి॥ | 0-8 |
| సంపూర్ణభారతం పిం॥ వ॥ | 1-4 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0-10 |
| ధర్మవ్యూహము కా॥ నా॥ | 1-0 |
| చింతామణి కా॥ నా॥ | 1-2 |
| చిత్రనళీయము ధ॥ కృ॥ | 1-6 |
| విషాదసారంగధర | 1-6 |
| ముక్తావళి | 1-4 |
| ప్రహ్లాద | 1 4 |
| చిరకారి | 1 4 |
| పాదుకాపట్టాభిషేకము | 1-4 |
| పాంచాలీస్వయంవరం | 1-4 |
| చంద్రహాస | 1 4 |
| సావిత్రీచిత్రాశ్వము | 1-4 |
| రోషనారా (శివాజీ) | 1 4 |
| బృహన్నల | 1-4 |
| వరూధిని | 1-4 |
| సౌగంధికం గుం॥ జ॥ | 0-8 |
| మాలతీమధుకరం బు॥ స్వా॥ | 1-0 |
| శ్రీరామజననము దో॥ సీ॥ | 0 8 |
| శ్రీరామప్రవాసము | 0-8 |
| శ్రీరామోద్యోగము | 0-8 |
| శ్రీరామవిజయము | 0-8 |
| శ్రీరామాశ్వమేధము | 0-8 |
| ఉషాపరిణయము | 0-8 |
| చంద్రకాంత చ॥ మా॥ | 0-10 |
| కన్యకాపరమేశ్వరీవిలాసము | 1-0 |
| సంగీతశశిరేఖ అ॥ చం॥ | 0-12 |
| సతీతులసి దో॥ సీ॥ | 1-4 |
| జయంతజయపాలం బ॥ కో॥ | 0- 0 |
| కుశలవపట్టాభిషేకం రా॥ నా॥ | 0-12 |
| సుహాసిని | 1-0 |
| అలీబాబా సో॥ రా॥ | 0-12 |
| సత్యహరిశ్చంద్ర రా॥ వె॥ | 0.12 |
| సంపూర్ణరామాయణం | 1-4 |
| సావిత్రి. దో॥ సీ॥ | 0-12 |
| పాదుకాపట్టాభిషేకం | 0-12 |
| మారుతీవిజయం గూ॥ కో॥ | 0-12 |
| సుమతీదేవి బ॥ కో॥ | 0-12 |
| సువర్ణపాత్ర రా॥ నా॥ | 1-0 |
| కనకతారా నాటకం చ॥ కే॥ | 1-4 |
| సంగీత కృష్ణలీల నా॥ శిం॥ | 1-0 |
| సంగీత కృష్ణలీల చ॥ మా॥ | 1-0 |
| సంగీత గులేబకావళి డిటో | 1-0 |
| బిల్వమంగళ చింతామణి | 1-0 |
| పాదుకా పట్టాభిషేకం | 0-12 |
| వేశ్యాహితబోధిని | 1 0 |
| వేశ్యామధురము | 0-8 |
| భక్తరామదాసు కే॥ శి॥ | 1-0 |
| పాంచాలీమానసంరక్షణము | 1-0 |
| సంగీత మార్కండేయ | C-1 |

వలయువారు :—జనరల్ బుక్కుడిపో,

బెజవాడ, కృష్ణజిల్లా.

